Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

బ్రిటనుకు జర్మనీ సందేశము

# గోలకొండపత్రిక

తాయిలాండుకు జపాను సందేశము

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కను శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ శ్రావణ బ॥౮ (౨౯-౧౧-౧౩౪౯ ఫ.) గురువారము సంచిక ౬౭

# సోమాలిలాండును బ్రిటిషుసేనలు వదలుట

## ఇటలీవారికి గొప్పనష్టము

### బ్రిటిషు సైనికుల క్షేమము

సోమాలిలాండులో ఆగస్టు ౧౬వతేది ఇటలీవారి పట్టుదల గల ఫిరంగులు, టాంకులు, విమానముల సహాయముతో దాడి సాగించిరి. బ్రిటిషుదళము అతిసాహసముగా శత్రువుతో పోరాడెను. బెర్బెరా రేవుపురమునకు వెనకకు తగ్గుచున్నను, బ్రిటిషు సైన్యము ప్రతిఘటనము పోరాడుచునే వెళ్లుచుండెను.

ఆగస్టు ౧౯వతేది నాటికి సోమాలిలాండులో నుండి బ్రిటిషు సేనలు తొలగించివేయబడినవి. ఫ్రెంచిసేనలు సహాయముగానుండునను ఆశతో సోమాలిలాండులో బ్రిటిషు సేనలుంచబడియుండెను. కాని ఫ్రెంచివారు జర్మనీకి లొంగుటవలన, బ్రిటిషువారి సహాయములో సగముకంటె ఎక్కువ తొలగినట్లయ్యెను. అందుచేత కొంతకాలము ఇటలీ సేనలతో పోరాడి వారికి నష్టము కలిగించు వంతవరకుండి బ్రిటిషు సేనలు ఉపసంహరించుకొను యుక్తమని తలచెను. సోమాలిలాండుకు క్రొత్తసేనలు పంపుదమనిన, అంతకంటె ముఖ్యముగా ఆలో సేనలు అవసరమైయుండ సోమాలిలాండుకు పంపవీలులేదనియు, పైగా అట్లు పంపుటకు తగిన వ్యవధిలేదనియు తలచబడెను. మొత్తముమీద ఇటలీసేనలకు చాలనష్టములను కలిగించి, తాము ఏమాత్రము నష్టపడకుండ తమ సేనలను తొలగించగలిగితిమని బ్రిటిషువారు ప్రకటించినారు. సముద్రముపైనను, ఏడెన్ గల్ఫుపైనను బ్రిటిషువారి ఆధిపత్యమున్నంతకాలము బెర్బెరారేవు, సోమాలిలాండు రేవులు ఇటలీవారికి ఏమాత్రము ఉపయోగించజాలవని బ్రిటిషువారనుచున్నారు.

#### విమానాల దాడులు

ఆగస్టు ౧౯వతేది బ్రిటిషువిమానాలు మిలానులోను, ట్యూరినులోను, జర్మనీ-స్విట్జర్లండు సరిహద్దుకద్దను విమానాల కార్ఖానాలమీదను బ్రిటిషు విమానాలు బాంబులువేసినవి.

పడమటి ఎడారిలో ఇటలీ విమానమొకటి బలవంతముగా దిగినది. అవిమానము పట్టుకొని, అందులోనివారిని ఖయిదుచేసిరి.

ఎర్రసముద్రములో కామరాను లంకపైగా సాగుచుండగా బ్రిటిషువిమానమొకటి శత్రు విమానము నెదుర్కొని, దానిని మండునట్లు కూల్చివేసెను.

శుక్రవారము రాత్రి అలెగ్జాండ్రియాపై దాడి చేసిన శత్రువిమానమొకటి బ్రిటిషు సంరక్షణల బలిమిచేత పడమటి ఎడారిలో విధిలేక దిగవలసివచ్చినది. అవిమానము చెక్కుచెదరకయున్నది అందులోనివారు పట్టుకొనబడెను.

సోమాలిలాండులో శత్రుసైన్యము సంచలనమును అటంకపెట్టుటకు ఆగస్టు ౧౭వతేది అనేక దాడులు సాగింపబడినవి. మార్గసాధనములపై సేనగా బాంబులు తగిలినవి. బ్రిటిషువిమానమొకటి సముద్రములో దిగవలసివచ్చినది. కాని సిబ్బంది రక్షింపబడినది.

ఆగస్టు ౧౭వతేది బార్డియాపై బ్రిటిషుయుద్ధనౌకలు బాంబులు కురిపించినప్పుడు శత్రువిమానములు వాటిని తాకకుండునట్లు బ్రిటిషు విమానదళము కాపాడిన వివరములు తెలుపబడినవి. తొమ్మిది శత్రువిమానములు నాశనమొనర్చబడినవి. మరియొకటి ఎక్కువ నష్టమైనది. బ్రిటిషు యుద్ధనావ బార్డియా, కాపుజో కోటలపై బాంబులు వేయునప్పుడు వాటిని రక్షిస్తుండిన బ్రిటిషు పోరాటపువిమానములు తొలుత ఒక ఇటాలీయ జలవిమానము మననావలను వెంటాడుటను చూచి, దానిని మండునట్లు కూల్చివేసినవి. కొంతసేపటికి ఇటాలీయ విమానాల జట్టుఒకటి బ్రిటిషు నావలపైకి వచ్చినది. నాటిని బ్రిటిషు పోరాటవిమానములు అపి, చెదరగొట్టినవి. రెండు శత్రువిమానములు సముద్రములోనికి కూల్చబడినవి. తర్వాత ఇంకొక పెద్దజట్టు బ్రిటిషు నౌకాదళము మీదికివచ్చినవి. రెండు విమానములు మండునట్లు చేసి కూల్చబడినవి. మూడవదానిని మనపోరాటవిమానము వెంటాడినది. అదియును ఆడవిడిఆకాశములో బద్దలైనది.

## యుగోస్లేవియాలో బ్రిటను ప్రతినిధిని వెళ్లగొట్టుట

యుగోస్లేవియాలోని స్కోప్లిజ్ నగరమునందు బ్రిటను కాన్సలుగానున్న రాల్ఫ్ పార్కరు గారు బెల్గ్రేడులో డెయిలీ మెయిలుపత్రిక విశేషవిలేకరునున్న టెరెన్సు అసరటను గారు స్వీజర్లండు పత్రికా ప్రతినిధి రడాల్ఫ్ సింగరు గారు యుగోస్లేవియా రాజ్యమునుండి తరుమగొట్టబడిరి. అల్బేనియా విషయమై అసత్యవార్తలను వ్యాపింపజేసి రోము బెల్గ్రేడు స్నేహసంబంధములను భంగపరుప వీరు ప్రయత్నించిరనియు, అందుచే ప్రభుత్వమువారి ఆగ్రహమునకు పాత్రులైరనియు అధికారులు తెలుపుచున్నారు.

## ఇటలీ-గ్రీసుల సమాధానము

### గ్రీసుకు ఇటలీ క్షమార్పణ

గ్రీసుదేశపు డిస్ట్రాయరులు రెంటిపై ఇటలీ బాంబులు వేసినందులకుగాను ఇటలీ గ్రీసుకు క్షమాపణ సంపినట్లున్నది. ఎప్పటికీ ఇక ముందిట్టి అపచారములు జరుగకుండుటకై గ్రీసు స్త్రీపురుషుల యొక్క రాకపోకలను గురించి ఇటలీ అధికారులకు తెలియచేయవలసినదని ఇటలీ కోరినట్లును గ్రీసు పరిహారము ప్రవేశించుచుండిన ఒక వార్తవలన తెలియుచున్నది. గ్రీసుకు ఇటలీ తాము క్షమాపణ చెప్పుకొనుచు, ఇటువంటివి జరుగకుండ ఆపుదామని, ఇటలీ సూచించిన పద్ధతికి ఒప్పుకొనబడినట్లు తెలియుచున్నది.



## ఇంగ్లాండులో జర్మను పోరుమాటు మనుష్యులు

### విమానాల దాడులలో బ్రిటనుకంటె మించిన జర్మనీనష్టాలు

బ్రిటిషుప్రభుత్వ వైమానికశాఖవారి ప్రకటనలోని అంశాలు

బ్రిటనుపై జర్మనీవిమానముల దాడి ఇంకను సాగుచునే యున్నది. ఆగస్టు ౧౭వతేదినాడు ఉదయమునుండి ౧౨ గంటల కాలము మాత్రము ఆగెను గాని మరల ఆనాటి రాత్రి నుండియే దాడి మరల సాగించబడెను.

#### వారము రోజుల ఫలితములు

ఆగస్టు ౧౭వతేది మధ్యాహ్నముతో ముగిసిన లెక్కలను చేర్చి బ్రిటిషుప్రభుత్వ విమానశాఖాధికారులు ఆగస్టు ౧౧వతేదినుండి ౧౭వతేది ముగియువరకు బ్రిటనుపై జర్మనీవిమానముల యొక్క దాడి ఫలితములను ప్రకటించినారు. వాటి ప్రకారము ఈవారము రోజులలో మొత్తము ౪౯౩ జర్మనువిమానములు బ్రిటనుపై జర్మనీదాడులలో క్రిందకూల్చబడినవి. ఈ దాడులను ప్రతిఘటించుటలో ౧౫౦ బ్రిటిషువిమానాలు క్రిందకూల్చబడినవి. మరియు జర్మనీపై బ్రిటిషువారి దాడులలో ౩౩ బ్రిటిషువిమానాలు క్రిందకూల్చబడినవి. ఈ లెక్కయంతయు స్పష్టముగా క్రిందకూల్చబడినట్లు కనిపించిన వాటి లెక్కమాత్రమే. ఇవిగాక క్రిందకూలకున్నను దెబ్బలు తినినట్టియు వెంటనే ఉపయోగించుటకు తగనివి అయినట్టియు, జర్మనువిమానముల లెక్క కూడ తక్కువగానుండదు అవిధముగా అంచనావేసినచో ఆగస్టు ౧౧వతేదినుండి వారము రోజులలో ౧౧౦౦ జర్మనువిమానములు దెబ్బతినినవని అందుచే బ్రిటిషువిమానశాఖవారు ప్రకటించినారు. వారపు ౧౧౦౦మంది జర్మనువిమానాలవారు చనిపోయిరనియు, బ్రిటిషువారు ౧౫౦మంది మాత్రమే అయియుందురనియు ప్రకటించబడినవి. అనగా రోజుకు ౭౦ జర్మనువిమానాలవారు ౧౦౦ మైళ్ల దూరమునకు పోయి నష్టమైనమాట, బ్రిటిషువారికి రోజుకు ౧౫ విమానాలవారు, ఎక్కువ తక్కువ అంతమాత్రమే నష్టమైనమాట జర్మనులకు మాత్రము తమ నష్టము, బ్రిటిషువారికే ఎక్కువయని గర్జించుచున్నారు.

ఇక వరుసగా ఆగస్టు ౧౫వతేదినాటినుండి దాడులఫలితము చూచెదము. ఆగస్టు ౧౫వతేదినాడు ౧౮౦ జర్మనువిమానాలు బ్రిటనుపై కూల్చబడెను. ఆగస్టు ౧౬వతేదినాడు ౭౫ జర్మనువిమానాలు కూల్చబడెను. ఆగస్టు ౧౭వతేదినాటికి కలిపి ౧౬వతేదినాడు బ్రిటనుపైకి తక్కువ జర్మనువిమానాలు వచ్చియుండెను. ఆగస్టు ౧౮వతేది బ్రిటిషువారివి ౨౨ విమానాలు క్రిందకూల్చబడెను. ఈ రోజు క్రొయిడను అనే విమానాశ్రయముపైకదాడి వెడలివచ్చిన జర్మనువిమానమొక్కటికూడ తిరిగి పోజాలలేదని బ్రిటిషువారనుచున్నారు.

ఆగస్టు ౧౯వతేది రాత్రి దక్షిణవేల్సుపై జర్మను విమానాలు వేసినబాంబులచే కొంతసొత్తు నష్టమయ్యెను. ఇంగ్లాండు ఆగ్నేయభాగములోను, నైరుతిభాగములోకూడ జర్మను విమానాలు బాంబులువేసెను. నైరుతిభాగములో కొన్ని ఇండ్లు పాడయ్యెను.

ఆగస్టు ౧౯వతేది ఉదయము ఇంగ్లీషుఛానలుపై ఒక జర్మనువిమానము క్రిందకూల్చబడెను.

ఆగస్టు ౧౭వతేదినాటిపగలు జర్మనువిమానాలదాడి లేనందునను బ్రిటిషుపోరాటపు విమానాలపైలట్లు హాయిగా విశ్రాంతిగైకొనిరి.

మరల ౧౭వతేదిరాత్రి ఒక్కొక్కటే ఒక్కొక్క జర్మనువిమానము ఇంగ్లాండు ఆగ్నేయభాగంలో ఒకపట్టణముపైకెగిరి బాంబువేసెను. ఇంగ్లండుపై కొన్ని జర్మనువిమానాలు తిరిగి చాలచోట్ల బాంబులువేసెను.

#### విశేషాలు

౧౮ఆగస్టు ౧౬వతేదినాటి కొన్నివిశేషాలు గమనించదగినవి. ఆనాటిరాత్రి జర్మనులు చాలమంది పారషూట్లతో కొందరు మిడ్లాండులోను మరికొందరు ఇంగ్లాండు ఈశాన్యభాగములోను దిగిరి గ్రామప్రాంతాలలోను ౧౦-౨౦మంది దిగిరి. వారలను బ్రిటిషు హోం గార్డులు పట్టుకొనిరి.

ఆగస్టు ౧౭వతేది ఉదయము జరిగిన ఒక విశేషమేమనగా, ఉన్నట్టుండి అంతట నిబుసపరభాగంలో కొన్ని బాంబులు ప్రేలుటచే జర్మనువిమానాలు వచ్చుచుండెనేమోయని ప్రజలు భయపడి రక్షకస్థానాలలో దాగుకొనిరి కాని విమానాలేవి రాలేదు. తర్వాత విచారించగా ఆప్రేలుళ్లు అంతకుపూర్వదినము జర్మనులువదలిన బాంబులు అప్పుడు ప్రేలినవి ఆలస్యముగా ప్రేలునట్లు జర్మనులు ఈ విధమైన బాంబులను చాలా వదలుచున్నారు.

ఆగస్టు ౧౭వతేదినాడు ఇంగ్లాండులోని ఒక జిల్లాలో జనులకు జర్మను పారాషూట్లనుండి దిగినవారు కనిపించిరి.

#### మరికొన్ని విమానాలదాడులు

ఆగస్టు ౧౮వతేదిఉదయము ఇంగ్లాండు వాయవ్యభాగంలో ఒక జర్మనువిమానము అనేకములైన బాంబులువేసెను ఆగ్నేయభాగంలో ఒక జర్మనువిమానము బాంబులువేసెను. రెండుచోట్ల రెండుపోట్లపై జర్మనువిమానాలు ఎగిరి, ఒకజిల్లాలో బాంబులువేసెను.

౧౮వతేదినాడు మధ్యాహ్నము సాయంకాలం కూడ జర్మనువిమానాలు ఇంగ్లాండుపై తిరిగి వేర్వేరుచోట్లలో బాంబులువేసెను. మొత్తము ఈ నాలుగుదాడులలో ౭౦౦ విమానాలపైనను జర్మనులుపయోగించియుందురు. ఇంగ్లాండు దక్షిణములోను ఆగ్నేయభాగములోను విమానాశ్రయాలపైనను, ఫాక్టరీలపైనను జర్మనులు బాంబులనువేసిరి.

మధ్యాహ్నము లండనునగరపు దక్షిణ పశ్చిమములలోను, ఇంగ్లాండు ఈశాన్య, దక్షిణభాగాలలోను ఇతరప్రదేశాలలోను జర్మనులు బాంబులనువేసిరి క్రొయిడను విమానాశ్రయపుమీదను కూడ బాంబులువేసిరి. కొంత ప్రజలఆస్తియు, కొన్నియిండ్లును పాడైనవి. మధ్యాహ్నము, సాయంకాలముగూడ జర్మనువిమానాలు లండనునగరముపైకి రాయత్నించెను గాని అవి బ్రిటిషు ఫైటరువిమానాలచేతను, క్రిందనుండి ప్రేల్చబడుచున్న విమానధ్వంసక శతఘ్నుల దెబ్బలచేతను తరిమివేయబడెను. కొన్నిచోట్ల బ్రిటిషువిమానాలకును జర్మనువిమానాలకును పోరాటములుగూడ జరిగెను. మొత్తముమీద బ్రిటిషువారు ౧౪౪ జర్మనువిమానాలను క్రిందికి పడగూల్చగలిగితిమనుచున్నారు, బ్రిటిషువారివి ౨౭ ఫైటరువిమానాలు నష్టమయ్యెను.

ఆగస్టు ౧౯వతేది ఉదయము ఇంగ్లాండు నిబుసుతిభాగముపైకి ఒక జర్మనువిమానము వచ్చి బాంబులువేయగా ఒకయిల్లు పాడయ్యెను. కొన్ని బస్సులు మండిపోయెను. మధ్యాహ్నము కూడ జర్మనువిమానాలువచ్చి ఆగ్నేయభాగంపై బాంబులువేసెను ఇంగ్లండుపై మరఫిరంగులు కాల్చెను ఇదేరాత్రి మిడ్లండు, ఇంగ్లాండు ఆగ్నేయ ఈశాన్యభూములపైకి జర్మనువిమానాలువచ్చి బాంబులువేసెను. వాయవ్యభాగంలో అగ్నిగోళాలబాంబులువేసెను.

#### ఐరిషుఓడపై బాంబులు

ఆగస్టు ౧౭వతేదినాటి వేక్స్‌ఫర్డుభాగంలోని ఒకరేవునుండి ఒక ఓడలో ఐరిషుప్రజలు ఇంగ్లండుకు ప్రయాణముచేయుచుండగా జర్మనులు మరఫిరంగులు ప్రయోగించుటచే ఇద్దరు ఐరిషుజనులు చచ్చిరి.

## జర్మనీపై బ్రిటిషువిమానాల బాంబులు

జర్మనీపై బ్రిటిషువిమానాలుగూడ యథాప్రకారమే దాడిచేయుచు సైనిక ప్రాముఖ్యముగల ప్రదేశాలపై బాంబులు వేయుచున్నవి, ఆగస్టు ౧౬వతేదినాడు క్రొత్తచోట్లపై అనగా ఇటలీలో బాంబులువేయుచోట్లపై ఇట్టిబాంబులు వేసిరి, వీటిలో విమానాలు చేయు కార్ఖానాలు, పెట్రోలు ఖజానాలు, ఓడలుండుప్రదేశాలు మందుసామగ్రి కార్ఖానాలుగలవు. ఆగస్టు ౧౭, ౧౮తేదిరాత్రి బ్లాకులలో ఓడలపైనను, జర్మనీలో రైల్వేలు పెట్రోలు ఖజానాలపైనను బ్రిటిషువిమానాలు బాంబులువేసెను ఫ్రాన్సు, హాలెండు, బెల్జియములపైకూడ ఇట్టిదాడులుచేయబడెను జర్మనుసామగ్రికి చాలనష్టము కలిగించబడెనని బ్రిటిషువారు వివరించుచున్నారు.

# హైద్రాబాదు స్వతంత్రరాజ్యము

## మారణ యంత్రాలయాల స్థాపించవలెను

### పూర్వము లాగుకొన్న దేశాలన్ని హైద్రాబాదుకు ఇచ్చివేయవలెను

### ఇత్తెహాదువారి నిర్ణయాలు

అంజుమనె ఇత్తెహాదుల్ ముస్లిమీన్ (హైదరాబాదుదక్కన్) వారు ఈక్రింది జ్ఞాపికను రై. ఆ. సర్ [నవరెఅజం] ప్రధానమంత్రిగారికి పంపినారు. ఈ అంజుమన్ యొక్క అధ్యక్షులైన నవాబ్ బహద్దరుయార్ జంగ్ బహద్దరుగారు జ్ఞాపిక [యాద్ దాష్తు] పై సంతకముచేసి ౧ ఆగస్టు ౧౯౪౦-౫౯ సహాదేవర్ ౯ ఫ నాడు పంపినారు. ఈజ్ఞాపికలోని విషయము లిట్లున్నవి.

"యూరోపులోని యుద్ధమువలన మన వర్తమాన భావిపరిస్థితుల నెమరు వేయవలసిన సమయము వచ్చినది. ముసల్మానుల ఏకైకప్రతినిధి సంస్థయైన ఈయిత్తెహాదువారి కోరికను ఆసఫియా ప్రభుత్వము బాగా ఆలోచించవలసియున్నను

హైద్రాబాదు ముసల్మానులు తమ ప్రభుత్వ మిత్రులైన ఇంగ్లీషువారికి అన్నివిధాలా హిట్లరుతో యుద్ధముచేయుటలో సహాయపడుచున్నారు, కాని ఈరాష్ట్ర గౌరవానికి తగినంత సైన్యము ఇచ్చుట నెలకొల్పబడలేదు. ఈరాష్ట్ర ప్రభుత్వమువారు ఆయుధసామగ్రిని సిద్ధముచేయుటకేమిన్ని పరిమితి ఏర్పాటు చేయబడలేదు. అట్టి రాజకీయ నిర్ణయాలేమిన్నీ లేవు కాని ఈ వాదుస్థితో చెప్పుకొనవలసివచ్చినదేమన యుద్ధసహాయానికి హైద్రాబాదునుండి కొద్దిసైన్యమే పోయినది. దానికవసరమగు ఆయుధసామాగ్రికూడా బయటినుండి సిద్ధమై వచ్చుచున్నది. కావున ఈఅంజుమనువారి అభిప్రాయములో సైన్య సంబంధము హద్దువరకు ఇప్పటిపద్ధతివదలి ఏమిన్నీ ఆలస్యములేకుండా ప్రభుత్వమువారు అనేక ఆయుధాగారాలను స్థాపించవలెను. ఇప్పుడు యుద్ధసహాయార్థమై యిచ్చుచు ద్రవ్యాన్ని అంతయు ఈయంత్రాలయాలకొరకే వ్యయముచేయవలెను.

సైన్యాన్ని పెంచుటకు ఆయుధాగారాలను పెట్టుటకు కావలసినదంతయు సమకూర్చుటయేకాక తమసంఘములోనుండి స్వచ్ఛంద సేవకులనుకూడ యిచ్చుటకు ఈఅంజుమన్ సిద్ధముగానున్నది. ఈనూతనసైన్యము యుద్ధానికి పనికివచ్చును. రాష్ట్రములో శాంతినికూడ కాపాడును.

పూర్వకాలంలో మరల క్రొత్తగా ఆయుధాగారాలను పెట్టుటలో ఈఇస్లామియా రియాసతుకు హైద్రాబాదు ముసల్మానులు అన్నివిధాలా బలిదానము అర్పించుటకు సిద్ధముగానున్నారు

శ్రీ శ. ౧౯౨౭లో హజ్రత్ నిజాముల్ ముల్కు ఆసఫ్ జా అవ్వల్ దక్షిణ హిందూస్థానంలో స్వతంత్రతను ప్రకటించినప్పుడు హైద్రాబాదు సర్వతంత్ర స్వతంత్రమైయుండెను. ఇతే సీలో బ్రిటిషువారికి ఆసఫియా సుల్తానులు సహాయముచేయుచువచ్చిరి. కాని యిప్పటిపరిస్థితి హైద్రాబాదు గౌరవానికి విరుద్ధముగానున్నది. ఎవరికైతే అన్ని ఆపత్తులలో సహాయముచేసెనో ఆట్టివారివలననే ఈరాష్ట్రము క్షీణదశలో నుంచబడుట ఇప్పటిప్రజలకు సంతాపకరముగానున్నది. ఈస్థితిని మార్చుటకు యీతరమువారు తృప్తిపడియుండజాలరు. మరల పూర్వాధిపత్యమును నూతనోజ్జీవనమును ఈరాష్ట్రానికి కలిగించవలెనని తహతహపడుచున్నారు.

బ్రిటిషిండియాలో రాజ్యాంగం విషయమై మార్పుచేయు ఆలోచనలు చేయుచున్నారు గొప్ప రాజకీయమార్పులు జరుగుచున్నవి వెస్టుమినిస్టరు శాసనమువంటి శాసనముద్వారా స్వాతంత్ర్యము లభింపనున్నది

ఇంగ్లాండువారితో పూర్తిగా వ్యతిరేకించి బ్రిటిషిండియాకీప్రతిఫలము కోరదమన్నప్పుడు ఇంగ్లీషువారికి విశ్వాసపాత్రమిత్రమైన యీరాష్ట్రానికి మంచికాలములో తమ పొరుగుదేశమైన హిందూస్థానముతో స్నేహమును పాటించుటకుగాను ఈహైద్రాబాదురాష్ట్రానికి స్వాతంత్ర్యమిచ్చుటకూడ యుక్తముకాదా? ఇదివరలో బ్రిటిషువారికిన్నీ ఈరాష్ట్రానికిన్నీ కొన్ని సంధిషరత్తులుండినవి, ఎప్పుడైతే హిందూస్థానానికి స్వాతంత్ర్యమిత్తురో అప్పుడు హైద్రాబాదుకున్ను దాని పూర్వస్వాతంత్ర్యాన్ని యిచ్చివేయవలెను. ముందుకాలంలో డుమినియన్ స్థితిపొందిన ఇండియాతో క్రొత్తసంధిషరత్తులను హైద్రాబాదు చేసికొనుటకు స్వతంత్రమైనదై యుండగలదు పూర్వములో ఇంగ్లాండువారికి సైన్యఖర్చులకుగాను ఈరాష్ట్రము కొన్ని రాష్ట్రాలను ఇచ్చివేసియుండెను. అవన్నియు ఇప్పుడు తిరిగివారకు ఇచ్చివేయవలెను, ఇప్పుడు హైద్రాబాదు వాటిని పాలించగలదు. వాటిపన్ను వసూలుచేయగలదు, సైన్యముపై ఖర్చుచేయగలదు. అందుచేత ఈక్రిందివాటిని అంజుమను కోరుచున్నది.

హైద్రాబాదు సైన్యానికి పరిమితి ఏర్పాటు చేసినారు దాన్ని తీసివేయవలెను. ఇదివరలో సైన్యంఖర్చులకని ఇచ్చినరాజ్యము వాపసుచేయవలెను. బ్రిటిషువారితోనుండి సంధిషరత్తులు ఇకముందు స్వతంత్రదేశాలవారికుండురీతిగా నుండవలెను. ఇట్లయుంటే సంధిచేసుకొనవచ్చును లేకుంటే విడిపోవచ్చును కేవలము హైద్రాబాదు ముసల్మానులేకాక బ్రిటిషిండియాలోని ముసల్మానులందరును హైద్రాబాదు కిరీటాన్ని సింహాసనాన్ని తమ రాజకీయౌన్నత్య చిహ్నముగా చూచుకొనుచున్నారని సత్తువకొద్ది ఈఅంజుమన్ తెల్పుచున్నది. ఈచిహ్నాన్ని ఉచ్ఛదశలో నుంచుటకై అన్నివిధములైన బలిదానాలు చేయుటకు సిద్ధముగానున్నారు.

ఇట్లు
బహద్దర్ యార్ జంగ్
మజ్లిసె ఇత్తెహాదుల్ ముస్లిమీన్ అధ్యక్షుడు
౧-౮-౧౯౪౦ఫ. నాటి
(రహబరె దక్కనునుండి)



# బ్రిటన్‌తో జపాను యుద్ధమునకు దిగజాలదు

## ముట్టడివల్ల జపానుకే నష్టము

"యార్కుషైర్ పోస్టు" నావికావిలేఖరి ఇట్లు వ్రాసినాడు—

ముఖ్యంగా మూడు కారణాలవల్ల దూరప్రాచ్యదేశంలో ఇంగ్లాండు సంకృష్ట సైనికస్థితి కనబరచుచున్నదని ఇందుమించుగా అన్నివిమర్శనలు చాటుచున్నవి. ఆమూడు కారణాలుయివి—

(౧) జపానుకోరికలను తిరస్కరించునెడల, దక్షిణసముద్రములలోవున్న బ్రిటిషు నావాశ్రయములను, నౌకలను జపాను ముట్టడించవచ్చును.

(౨) చిట్టచివరకు పసిఫిక్,ఇండియా సముద్రములలో నావావాణిజ్యమును భగ్నముచేయుటకు ఆముట్టడి విస్తరింపచెయ్యవచ్చును, (౩)మూడవది ఇంగ్లాండు, మధ్యధరాసముద్రాలలో బ్రిటనుకు ప్రస్తుతము నావాసైన్యము యొక్క ఆవశ్యకత యెక్కువగానున్నదిగనుక, పైనచెప్పినముట్టడులను ఎదిరించుటకు బ్రిటను నావాసైన్యమును పంపుస్థితిలో వుండజాలదు,

మొదటి రెండుకారణములనుగురించి మొదటలో ఎంచటము జపానుతో యుద్ధము సంభవించినట్లయిన యీదేశాన్ని యుద్ధములో దించుటరేయగును ఈ భయముండుటచేత, అసలు జపాను యుద్ధములోదిగుటకు సిద్ధముగా ఉన్నదా లేదా అని ప్రశ్నించుట అసందర్భముకాదు. జపాను యుద్ధమునకుసిద్ధముగావున్నందుకు సంగతి సందేహాస్పదము, లేనిచో ఈబెదిరింపును జపాను యిదివరకే ఎందుకుచేసివుండును.

అదికాక, జపాను సైనిక,విమాన నావాబలములలో మూడింటిలోరెండువంతులు చైనాయుద్ధములోతగులుకొనివున్నవి. ఈసైన్యములు బయటికివచ్చువరకు జపాను వేరొకముట్టడి ప్రయత్నముచేయలేదు. ఒకవేళ జపాను బ్రిటనుతో ప్రత్యక్షముగ పోరాటమునకు సంసిద్ధపడిన దనుకొందము. అప్పుడుఅమెరికాతప్పకుండ ఇంగ్లండుపక్షమున యుద్ధములోదిగును.

ఇప్పటియుద్ధము ప్రారంభమయినప్పటినుండి అమెరికానుండి జపాను తప్పనిసరిగా తెచ్చుకొనుచున్నయుద్ధసామగ్రి నిలిచిపోవును, ఈవిషయమై జపాను యోచించుకొనవలసివున్నది. అంతేకాదు, యీసమయమును అదనుగా తీసుకొని యింకొకప్రక్కనుంచి రష్యా జపానుమీదికిపోవును. దూరప్రాచ్యదేశములలోవున్న రష్యాయుద్ధవిమానాలు జలాంతర్గాములు జపానునుఒక్కచూపు చూచును.

ఇవన్నియుయిట్లువుండగా. ఇంటను, బయటనుకూడ జపానుఆర్థికముగా అవస్థలు పడుచున్నది, మూడుసంవత్సరాలనుంచి చైనాలో యుద్ధముచేయుచున్న జపాను చాల అలసిపోయినది. ఈపరిస్థితులలో జపాను బ్రిటనుతోయుద్ధమునకు దిగి బ్రిటనుతరఫున అమెరికాగాని రష్యాగాని పూనుకొన్నచో ఇంక జపానుదుర్భరస్థితియెట్లుండునో వేరేచెప్పుట అనవసరము.

మొదటవుదహరించిన మూడవ కారణమునకు సమాధానములేకపోలేదు. బ్రిటనుపట్ల హిట్లరు, ముస్సోలినీ, ఫ్రాన్కోల కోరికలు ఎంతవివరముగా తెలిసినవో జపానుకోరికలుకూడ బహిరంగముగాఆర్థికమయినవి,అటులైనప్పుడు జపానుపరిస్థితులుచక్కబడువరకు బ్రిటను మౌనముగా వూరకొనుట రాజనీతికాదు. పరిస్థితులు బ్రిటనుకుఅనుకూలముగావున్నప్పుడే చర్యతీసుకొనుట మంచిది. ఇప్పుడు బ్రిటనుఅవలంబించిన విధానమువలన చివరకు బ్రిటనుకు చాలలాభమున్నది.

మనలోమనమే ఒకప్రశ్న వేసికొని, దానికి వచ్చుసమాధానము చూచెదము, బ్రిటిషువారు తమ నౌకలను సింగపూరువరకు వెనుకకుతెచ్చివేసితిమనుకొనుడు ఇక్కడనుంచి జపానుపైన బ్లాకేడు అస్త్రముప్రయోగించుటయనగా, జపానుకు ౨౦౦౦మైళ్ళదూరమునుంచి ఈఅస్త్రము ప్రయోగించుచున్నను జపానుకుతగులు ఒత్తిడి ఇంతింతకాదు.

మనముపిడిచిపెట్టుప్రదేశములన్నింటిని నిష్ప్రందేహముగా జపానుఆక్రమించుకొని, జపాను జీవితాధారమైన చాలముడిపదార్థములకు ఆదేశములనీళ్లువదలవలసివచ్చును. అంతేకాకుండ, దానివస్తువులనుఅమ్ముకొనుటకు మార్కెట్టు వుండదు.

బహుశా, అప్పుడు జపాను యింకొకపనికి పూనుకొనునేమో. న్యూజీలాండు, ఆస్ట్రేలియా సముద్రతీరాలపైవిమానదాడి ప్రారంభించవచ్చు కాని, చైనాలో యుద్ధము సాగుచున్నంతకాలము ఇదిదుస్సాధ్యము యుద్ధనౌకలనుపంపి బ్రిటిషువాణిజ్యనౌకలమీదికి జపానుదృష్టి మరలించుటయనగా, కార్స్లైర్ చెప్పినట్లు యిందువల్లకలుగు నష్టము అనగింజలో ఒకవంతు వుండును:

ఈపరిస్థితులలో జపానులోపల సంఘటనలు యెట్లువుండగలవో ఊహించుకొనగలము, జపాను వాణిజ్యనౌకలు నిట్టూర్పులువిడుచుట రేవులలో పడుకొనిగాపడివుండును. కర్మాగారములలోవస్తువులు చలామణికాకుండ కుప్పలుగా పడివుండవలసివచ్చును ఫ్యాక్టరీలు పనిలేకుండ పడిపోవును, ఇదివరకే మలమలమాడుచున్నదేశము మరీఅధ్వాన్నమయిపోవును. చివరకు దూరప్రాచ్యనాణెలు పూర్తిగా నాశనము కావలసివచ్చును, తూర్పుదేశమునకు యింకనుసైన్యము లను పంపనవసరములేకుండానే యీఫలితము లు బ్రిటను జరిగించగలుగును.







# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర శ్రావణ బ॥ ౮
గురువారము

## హిందూస్థానానికిచ్చే వరాలు

వైస్రాయి బహాదరుగారు ౮ అగస్టు నాడు ఒక గొప్ప ప్రకటన భారత భావి రాజ్యాంగ విషయములో కావించినారు. ఆప్రకటనను, పార్లమెంటులో అమెరీగారు చేసిన వ్యాఖ్యానాన్ని, పాఠకులు చదివియే యున్నారు. అందలి విశేషాలేమో కనుగొందము.

గతసంవత్సరము ౩ వ సెప్టెంబరు నాడు బ్రిటిషువారు జర్మనీపై యుద్ధప్రకటనచేసిరి. ఇండియాకూడ యుద్ధములో దిగినది అనిచెప్పిరి. కాంగ్రెసువారికి కోపమువచ్చెను. మమ్మడుగకుండ మా అనుమతిలేకుండా మా దేశాన్ని యుద్ధములో ఎందుకు దింపినారు. మే మెందుకొరకై యుద్ధము చేయవలెను. మీ యుద్ధాశయముల ప్రకటించుమది అని యెన్నెన్నో ఆక్షేపణలుచేసిరి. ఏడు సూబాలలోని కాంగ్రెసు ప్రభుత్వాలు రాజీనామా పెట్టెను. ఇంగ్లీషువారు ప్రపంచ ప్రజారాజ్యముకొరకు సర్వజనుల క్షేమంకొరకు యుద్ధము చేయుచున్నామని ఆదిలోచెప్పిరి. తర్వాత చిన్నచిన్న రాజ్యాలక్షేమంకొరకే అని చెప్పిరి. తరువాత యూరోపులోని చిన్న రాజ్యాలకొరకు అనియుచెప్పిరి. అయితే మాగతియేమి!అని భారత దేశపక్షాన కాంగ్రెసువా రడిగిరి. దానిపై వైస్రాయిగారు నానా నాయకులను (౧౭౨ చుందివరకు) పిలిపించి మాట్లాడిరి. గాంధిగారిని ౬ మారులు పిలిపించిరి. జిన్నాగారిని ఇంచుమించు అన్నిమారులు పిలిపించిరి. హిందూమహాసభాధిపతులగు సావర్కారుగారినిగూడా పిలిపించిరి. తుదకు తేల్చిన దేమంటే హిందూముసల్మానులు మొదట సమాధానపడి ఏకముఖంగా మీ కోర్కెలేమో తెలుపండి అనిరి. ఇది అసంభవకార్యమైపోయెను ఈ వివరాలన్నీ ఇప్పుడు ఎత్తివ్రాసే వీలులేదు. తుదకు పరిస్థితులువిషమించగా వైస్రాయిగారు డుమినియన్ స్థానము మీకిస్తాములనిరి. ఎప్పుడిస్తారయ్యాఅంటే "వీలైనంత తొందరగా" అని సెలవిచ్చిరి. మరి డుమినియన్ స్థానమంటే వెస్టుమినిస్టరు శాసనములో నిర్వచించినప్రకారంగా ఉంటుందా అని గాంధీగారే అడిగినారు. దానికి "అవును వెస్టుమినిస్టరు రకము (Variety) దేమీ కిస్తాము" అని వైస్రాయిగారనిరి

కాంగ్రెసువారిధోరణి మారిపోయెను. మాకు డుమినియన్ స్థాన మెట్లు వ[...]చును? మాకు సంపూర్ణస్వాతంత్ర్యమే కావలెను. అఖిలభారత ప్రజాపరిషత్తు ప్రజలచే ఎన్నుకొనబడినది భారత దేశమున కవసరమగు రాజ్యాంగమును నిర్ణయించవలెనేకాని ఇం[...]వారు తమకు తోచినంత ఇస్తామంటే మే మొప్పుకోము అని అన్నారు. ఇట్లా మరికొన్నాళ్లు జరిగింది.

మరల యీ అగస్టు ౮ వ తేదినాడు వైస్రాయిగారు ఒక ప్రకటన గావించినారు. వైస్రాయిగారి కార్యనిర్వాహకసభను విస్తరింప జేయుదుమనియు దానిలో అన్ని పార్టీల ముఖ్యులను తీసుకొందుమనియు, యుద్ధము ముగిసినతర్వాత వీలైనంత త్వరగా డుమినియన్ స్థానమిత్తుమనియు, దానినిర్ణయము భారతీయముఖ్య కక్షులవారిప్రతినిధులచే చేయబడునని కు, వీలైనంతవరకు వారినిర్ణయాలకు సహాయముచేయ ప్రయత్నింతుమనియు, ఇప్పుడుమాత్రము యుద్ధములో అందరును భాగాసహాయము చేయవలయుననియు అందునిమిత్తమై వేరొక యుద్ధసమాలోచక సంఘము నేర్పాటు చేయుదుమనియు చెప్పినారు.

ఈ ప్రకటనపై ఇంగ్లాండులోను అమెరికాలోను, బాగా ప్రచారం జరిగింది. ఇండియాలోను జరిగింది. కాని కాంగ్రెసుపక్ష పత్రికలన్నియు దీనిని నిరాకరించినవి!ఎవరినిర్ణయ మెట్లున్నను కాంగ్రెసువా రొప్పుకొనకుంటే ఏమాతుంది అని అంటే దానికి భారతమంత్రి గారగు అమెరీగారే సెలవిచ్చినారు. ఎవరెవరు ఒప్పుకుందురో వారి సహకారముతోనే ఈకొత్త నిర్ణయం అమలులో నుంచబడును అని అన్నారు. కావున దేశానికి తృప్తికలుగనీ కలుగకపోనీ ఈ కొత్తమార్పు జరిగితీరుతుంది అని తలపవలెను. ఇప్పటి మార్పువలన ఏమిలాభము అనునదింకొకప్రశ్న. విస్తరింపబడిన కార్యనిర్వాహక వర్గమువారి అధికారాలేమి? వారు శాసనసభకు బద్ధులైయుందురా! లేదు! అని అమెరీగారు స్పష్టపరిచినారు. వైస్రాయిగారైనా ఈ నూతనవర్గానికి బద్ధులా! వైస్రాయిగారుబద్ధులుకారు. ఇప్పటికథ యెట్లున్నా ముందుకథ అయినా ముచ్చటగా ఉందాలేదా అని విచారింతము. యుద్ధము ముగిసిన తర్వాత మన దేశానికి డుమినియన్ స్థానము ఇస్తాము అని సెలవిచ్చినారు. అయితే యెప్పుడు! "ఎంత తొందరగా వీలగునో అంతతొందరగా" అనికూడా స్పష్టముచేసినారు పాపం కాని మన దేశంలో ఇంచుమించు అన్నిపార్టీలవారు తుదకు మితవాదులుకూడా 'ఏమయ్యా – ఏడాదా, రెండే ళ్లా యేమిన్నీ చెప్పక—వీలైనంత తొందరగా అంటే యెట్లు' అని నిలదీసి అడుగుచున్నారు. దానికి అమెరీగారు వ్యాఖ్యానం చేసినారుకాని వారున్ను ఒకపరిమితి ఏర్పాటుచేయకపోయిరి. ఆ డుమినియన్ స్థానములోనైనా ఎవరి అభిప్రాయములకు విలువయుం[...]? అధిక సంఖ్యాకుల మాటకు చెల్లుబడి యుం[...]? అంటే [...]దట. ఎందుకంటే ముస్లిములను, ఇతర అల్పసంఖ్యాక వర్గాలను, రక్షించే [...] [...]న్నారు [...] [...] [...]టు. పైగా అయినవూటు [...] [...] సంస్థానాల వట్ట [...]న్నారు. వారితో [...] [...] [...] సంధిపత్రాలు

## ఖమ్మంమెట్టులో అరెస్టులు

(ఒ. వి.)

మెహారు ౨వతేదిన పిల్లచెన్న క్రిష్ణగోపాల వీరభద్రం అనువారలు గోడలపై ౧. యుద్ధనిధికి ఫవ మనుష్యసహాయం చేయరాదు. ౨.బ్రిటిషుసామ్రాజ్య వాద న్ని ధ్వంసము చేయవలెను ౩. మ. శా నిసత్వాన్ని నాశనము చేయవలెను అంటె సామ్రాజ్య వాదానికి సహాయంచేయరాదు." అను కాగితములు అంటించుటచే కల్లంపాడులో అరెస్టుచేయబడి ఖమ్మంమెట్టుకు తీసుకొనిరాబడిరి. పోలీసులు ఎంతో యత్నించగా వారు సుమారుయిరువదిమంది పేర్లుచెప్పిరి. అందులో యింతవరకు

౧. పగెపు నారాయణ, ౨. రామినేని వెంకన్న, ౩. కత్తి వెంకటనరసింహం, ౪. బుడిగెం వీరన్న, ౫. చిలంచర్ల రాములు, ౬. కల్లూరి నరసింహం, ౭. వడ్డపల్లి నారాయణ, ౮. కొండపల్లి క్రిష్టయ్య, ౯. తెక్కెం నరసింహం, ౧౦. మంగళగిరి జగన్నాథం.

మొదలగువారలు క్రిమముగా అరెస్టుచేయబడిరి పోలీసులు ఇండ్లుసోదా చూడగా కొన్ని కాగితములు, కొన్ని పుస్తకాలు,మరియు అచ్చుకొట్టిన సీసపుముద్దలు మొదలగునవి దొరికినవి. ఇంకను కొంతమందిని అరెస్టుచేయుచునేయున్నారు. విచారణలుమాత్రము జరుగుటలేదు

—

లేవా? వాటిని పాలించేవారు ఇంగ్లీషు వారుకారా? ఇవన్నీ యిట్లుండగా డుమినియన్ స్థానం ఇచ్చినా భారత దేశం యొక్క సైన్యశాఖ, విదేశాంగశాఖ ఇంగ్లీషువారి చేతులలోనే ఉండగలదట!

ఈవిధంగా ఇకముందు భారతదేశం బ్రిటిషు సామ్రాజ్యములో స్వేచ్ఛగా, సరిసమాన భాగరిగా (free and equal parternership) నుండగలదని వైస్రాయిగారు ప్రకటనచేసినారు. ముందుకాలములో ఈ విధంగా ఉంటే ఉం[...]డ వచ్చునేమో. పదేండ్ల క్రిందటనే వెడ్జివుడ్ బెన్ గారు ఇండియా మంత్రిగానుండి నప్పుడు ఒకగొప్పప్రకటన చేసియుండిరి. "ఇండియా ఇదివరకే డుమినియన్ స్థాన పుహక్కులను అనుభవించుచునే యున్నది" అని పార్లమెంటులో సెలవిచ్చిరి. కాని యింతవరకును దాని అనుభవము లేకపోగా యిప్పుడు ఇంగ్లీషువారు యుద్ధం ముగిసిన తర్వాత "వీలైనంతలో చాలాతొందరగా" ఇండియాకు డుమినియన్ స్థానం ఇయ్యగలము అని నొక్కినొక్కి చెప్పుచున్నారు. ఈ చర్చలనుండి మనకు స్థూలంగా అర్థమయ్యే విషయమేమనగా ఇకముందు విస్తరింపబడనున్న వైస్రాయిగారి కార్యనిర్వాహక సభలో కొందరు పెద్దమనుష్యులు వైస్రాయిగారిచేతనే తీసుకొనబడుదురు. వారు వైస్రాయిగారికే బాధ్యులు. వారుశాసనసభకు బద్ధులుకారు. ముందు యుద్ధానంతరము డుమినియన్ స్థానమిత్తురు కాని కాలపరిమితి నిర్ణయించుటలేదు. అందుచేత అది ౧౦ ఏండ్లుపట్టునో ౨౦ ఏండ్లు పట్టునో యెవరికిన్నీ తెలియదు. కాంగ్రెసువారు బుద్ధిమంతులై దీన్ని ఒప్పుకుంటేసరి లేకుంటే ముస్లింలీగు, హిందూమహాసభ, అల్పసంఖ్యాకవర్గాలు, హరిజనులు, దేశీరాజులు, సిక్కులు, పార్సీలు మున్నగువర్గాల వారున్నారుగదా వారితోనే పనితీసుకుంటారు.

ఇంతకు ఈచర్చలవలన తేలేవర్తమానమేది యేమనగా ఎంతవరకైతే భారతీయులలో స్వార్థపరత, మతావేశముడుండునో ఎంతవరకైతే వారిలో ఐకమత్యముండదో అంతవరకు వారికిముక్తి లేదు. "ఇండియాలో పరస్పర భిన్నాభిప్రాయాలున్నవి మేమేమిచేయగలము" అని అమెరీగారు స్పష్టంగా పార్లమెంటులో చెప్పనే చెప్పినారు. కాని ఐకమత్యంభారతదేశంలో కుదిరే అట్టులేదు. ఇప్పటి పిథానం చూడగా అది స్పష్టంగా కనబడుతుంది. ఇకనైనా దైవమాయ సంభవించితే యేమో చెప్పజాలము.



## నిజాం రైల్వే నౌకర్ల మహాసభ

సికింద్రాబాదు (దక్కన్) మెహరు ౧౩ శనివారము అగస్టు ౧౭ నాడు సికింద్రాబాదులో రైల్వేవారిసభజరిగెను- మీర్ అక్బర్ అలీంఖాన్ గారు అధ్యక్షతవహించిరి- వీరిట్లుపన్యసించిరి- "నిజాం రైలు ధనికవర్గంవారిది కాదు - అది ప్రభుత్వమువారిది- అట్టిచో రైల్వేనౌకర్లకు ఇబ్బందులున్నవనివినుటకు నాకుచాలావిచారంకలుగుతుంది- రైల్వేవారి యూనియన్ను రైల్వే అధికారులు ఒప్పుకోలేదు- దీనిని తుదముట్టిన సమరసంగా పరిష్కరించుకోవలెను

యుద్ధములో మనముసహాయపడవలెను- దీనివలనమనరాష్ట్రపరిశ్రమలుకూడా అభివృద్ధికివచ్చును- ఇకముందుఇండియాకు డుమినియన్ స్థానము రానున్నది- అందు హైద్రాబాదుకే స్థానముంటుంది ఆ నేవిషయాన్ని మనంఇప్పటినుండియే ఆలోచించవలెను- మనరాష్ట్రము బ్రిటిషుసామ్రాజ్యములో సంపూర్ణస్థితికిరావలెను"

తర్వాత ఫతెఉల్లాఖాన్ గారు మాట్లాడిరి- తర్వాత కొన్ని తీర్మానాలు కావింపబడెను- అందు ముఖ్యమైనది రైల్వేఉద్యోగుల సంఘానికి అనుమతియ్యవలెనని కోరినారు-

బ్రిటిషుఇండియానుండి గొప్పగొప్పనాయకులు సందేశాలుపంపియుండిరి-అవిసభలో చదువబడెను-

## శ్రీవైష్ణవకృష్ణజయంతీ నిర్ణయము

ఈసంవత్సరము ప్రాయశః కొన్ని పంచాంగములలో ౯౫॥బ॥౫॥ సోమవారమురోజునకే శ్రీవైష్ణవకృష్ణజయంతి అనివ్రాసినారు కాని శుద్ధనక్షత్రప్రధానవాదులగు శ్రీవైష్ణవులకుమాత్రమారోజున కానేరదు, ఆనాడురోహిణీ ౬౦, ఘడియలు వున్నప్పటికిని సూర్యోదయాత్ పూర్వము కృత్తికానేస సంక్రమించినందున మరునాడు అనగా ౯౫॥బ॥౫॥ మంగళవారమునాడే శ్రీవైష్ణవులుశ్రీకృష్ణజయంతి (కర్ణాటతినక్షత్రం) ఆచరించవలయును,

ప్రమాణములు నారదీయము

"జయంతీ ద్వివిధా జ్ఞేయా శుద్ధావిద్ధేతిసత్వరః
తాత్వాత్వావిద్ధా, పరాగ్రాహ్యసా శుద్ధావైష్ణవోత్తమైః"

"విద్ధాతుసప్తమీ యుక్తాశుద్ధాతు నవమీ యుతా,
రోహిణీకృత్తికాయుక్తావిద్ధా శుద్ధామృగాన్వితా"

తిథివిద్ధా, నక్షత్రవిద్ధాఅని విద్ధలు రెండువిధములు. అష్టమీనాడు పూర్వముసప్తమీ వున్నయెడల సప్తమీవిద్ధయనియు ఆనాడే తరువాత నవమీవచ్చినయెడల శుద్ధయనియు, రోహిణీకి పూర్వము కృత్తికయున్నయెడల కృత్తికావిద్ధయనియు రోహిణ్యానంతరమున్న గశిరవచ్చినశుద్ధమనియును, ✕ సూర్యోదయేనాపూర్వేణా ముహూర్తంయది సంయుతా, తిథి స్సాచవిద్ధాస్యాత్ ఇతితత్త్వవినోవిమః అను ప్రమాణానుసారము సూర్యోదయానంతరమేకాక పూర్వము రెండుఘడియలకు సంక్రమించినను వేధదోషమున్నట్లే అలాటిసందర్భములో ప్రస్తుతం ౨౫॥అదివారమురోజున కృత్తిక ౫౬ ఘడియలకుపైన ఉండుటవలన రోహిణీ విద్ధదోషముతోకూడినది కావున ౯ నాడే ఆచరించవలయును-యీఅంశమునే మనసైజాం నగరపురంలో అచ్చుపడిన మహాశాస్త్రి పంచాంగమునందుమాత్రము ౯ నాడువ్రాసియున్నది. ఈకనుక ఇకను వైష్ణవులు ముఖ్యముగా తెలుసుకొను ఆవశ్యకతయున్నయెడల పత్రికాముఖానలేక ఉత్తరరూపముగానో తెలిసిన విన్నవించుకొందును.

ఇట్లు
గోవర్ధనం, రామానుజాచార్యులు
సీతారాంబాగు
హైదరాబాదు (దక్కన్)

## గద్వాల వార్తలు

### యుద్ధనిధికై నిజాం స్టేటు రైల్వే వారి నాటకము

యుద్ధనిధికి సైకము ప్రోగుచేయుటకొరకై యన్.యస్.రైలువారు వారికంపెని నౌకరులు కొన్ని డ్రామాలను తయ్యారు చేసినారు. వానిని గల స్థలాలలోఆడి అక్కడవచ్చిన సైకము యుద్ధనిధికియిచ్చుచున్నారు. యీడ్రామాను తయ్యారుచేసినది శ్రీవెంగలరావు గారిచేతయు ప్రశంసనీయులు. యిట్టిడ్రామాల సిల్సిలాలోనే వారు శ్రీగద్వాల నగరమందు ౬మెహరు నాడు "చింతామణి" నాటకమును ప్రదర్శించిరి. వారి నాటకము ,చాలా జయప్రదముగా జరిగినది. ఇక్కడ పెద్దపెద్దఆఫీసర్లుఅందరువచ్చి తుదివరకువుండి నటకులను ప్రోత్సహించిరి.

ఇంక యిందలిముఖ్యపాత్రధరించినవారి విషయమై కొంత వ్రాయవలసియున్నది. ముఖ్యపాత్రధారిణి మిస్. కే. కమలకుమారి ఈమె పాత్రమును ధరించెను, ఈమె యింతకుపూర్వము కొన్ని సినిమాలలోగూడ నటించినదని తెలియుచున్నది. వీరితమపాత్రపోషణ చాల శ్లాఘనీయముగజేసిరి పాటలుగూడ బాగుగ పాడినారు. కానివీరిభాష, అభినయములకు తగినట్లు వీరివేషముబాగుండలేదు, కట్టుకొన్న చీరలు పెట్టుకొన్న సొమ్ములు చాలా హీనముగానుండెను. అంతేగాదు ఆమె అంత ఆకర్షణీయముగా లేకుండెను.

"వాస్యకలానిధి"యని పేరుగాంచిన సుబ్బిశెట్టిపాత్రమును ధరించిన వీ. వెంకట్రావుగారికి యీడ్రామాలో మొదటిబహుమాన మివ్వవచ్చును. వారివేషము శెట్టిమాదిరిలేకపోయినను భాష శెట్టిని మరపించుచుండెను.

మస్ కుమారిగారు రాధ పాత్రనుధరించెను. వీరివేషము బాగుండెను గాని, భాష సున్న, అభినయము అంతకుముందే సున్న. ఒక్కలోటున్న తక్కినప్పుడు ఆమె ఎమిమాట్లాడినదిగూడ వెనుకవారికి వినబడనేలేదు. కాబట్టిభాషావిషయమై ఈమె ఎక్కువదృష్టి సల్పవలయును.

### అధికారుల మరణములు

ఈసంవత్సరము గద్వాలలోని అధికారులు చాలమంది చనిపోవుచున్నారు. ఏమికారణమో తెలియదు! మొదట ౧౫౦రూపాయిల జీతము తిను వైద్యాధికారమ్మగారు చనిపోయిరి.తరువాత ౧౦౦రూపాయిలు జీతముతిను స్టేటుసైరవికార్ బుడ్డేసాబుగారు చనిపోయిరి. స్టేటుట్యూటరుగారగు రామారావుగారుచనిపోయి నెలకు నెంరూపాయిలుమిగిలించిరి. ఇప్పుడు పిన్నవయస్కులైనప్పటికిని స్టేటు యింజనీయరు గారైన శ్రీయుత్ పంపల్ అయ్యంగారు చనిపోయినారు. వీరిసంబళము నెలకు౫౦౦రూపాయిలుండెను అంతాగలసి నెలకు౪౦౦రూపాయిలు నెలకు మిగులును.

### యుద్ధనిధి

హరికేష్ ఫండు చాలాత్వరముగాప్రోగుచేయబడుచున్నది. అధికారులు అనధికారులు గల యుద్ధకమిటీయొకటి ఏర్పడినది, ఇప్పటికే౨౦౦౦ రూపాయిలు హరికేష్ ఫండుకుపంపినారని తెలియుచున్నది. పైగా శ్రీమహారాణీగారు౫౦,౦౦౦ రూపాయిలు పంపినారనిగూడ తెలియుచున్నది.

## మేనకానృత్యము

హైదరాబాదు(దక్కన్) అగస్టు౨౦ యుద్ధసహాయార్థము మేనకాదేవిగారు ప్రధానమంత్రిగారి అధ్యక్షతలో ఒక నృత్యసభచేయుచున్నారు ౨౪ అగస్టునాడు జమ్రుదులో సాయంత్రము ౬-౩౦ గంటలకు ప్రారంభంకాగలదు.

## ఆమెరీగారి ఉపన్యాసము

(2వ పేజీతరువాయి)

దవలెను. జనిషను ఈసంస్థ ప్రజాప్రతినిధి సంస్థగ యుండగలదు. కేవలము ఒక రౌండు టేబిల్ సభవలె ఈ సంస్థ సూచనలను గావించుట. ఈ సూచనలను బ్రిటిషు ప్రభుత్వమువారు ఇష్టమున్న అంగీకరించుట లేకున్న నిరాకరించుట జరుగగలదు. భావి రాజ్యాంగ నిర్మాణమునుగురించి యీ సంస్థ గావించిన సూచనలకు ఎక్కువ ప్రాధాన్యమొసగు చట్టమును తయారుచేయు విషయమున ఈసూచనలను మూలాధారముగ గైకొనవలయుననియే ప్రభుత్వపు ఉద్దేశ్యమైయున్నది.

సర్ ఆల్ఫ్రెడ్ నాక్సుగారు:—ఈసంస్థ సూచనలు ఈసభకు చర్చకు తేబడునా?

అమెరీగారు:—ఇతర డొమినియనుల విషయమునకూడ ఇట్టివిధానమే అనుసరింపబడెను. ఈ సంస్థ గావించు సూచనలపై చర్చగావించి పరిశీలించి ఈసభవారు ఆమోదించుట సంప్రదాయమైయున్నది.

### సంస్థానాధీశులు

సంస్థానాధీశులు తెల్లవారు ప్రభుత్వమున చేరనంతకాలము వారికి ప్రస్తుతమున్న హక్కులు హోదా నిలచియుండును. ఈహక్కులను సంరక్షించుబాధ్యత బ్రిటిషు ప్రభుత్వముపైయుండును. దక్షిణాఫ్రికాకు అధినివేశ ప్రతిపత్తియొసగబడిన పిమ్మటకూడ ఇట్టిప్రత్యేక హక్కులను సంరక్షించుబాధ్యతను బ్రిటిషుప్రభుత్వమువారే యుంచుకొనిరి.

### అనుసరింపబడు కార్యవిధానము

రాజ్యాంగమును తయారుచేయు విషయమున అనుసరింపబడు విధానముగురించి కొంతమంది సభ్యులు ప్రశ్నించిరి. వైస్రాయిగారి కార్యవర్గమే ఈసంస్థను సమావేశపరచి ముందుజరుగవలసిన కార్యకలాపమునంతయు జరిపెదరా యనికొందరు ప్రశ్నించియున్నారు. గొప్పబాధ్యతలను నిర్వర్తింపకార్యవర్గసభ్యులు నియమింపబడిరిగాని పైనసూచించినపనులను చేయుటకువారు నియమింపబడలేదు. కాని అన్నిపక్షముల నాయకులతో కూడినకార్యవర్గము, అన్ని పక్షములతో కూడిన యుద్ధసలహాసంఘము ఏర్పడి, సమరసభావముతో అందరుకలిసి పనిచేయుచున్న, అన్నిపక్షములకుల నోన్యన్యము కుదురుటకు అనుకూలావకాశమేర్పడుననియు, ఈవిభేదములు అంతమొందుననియు నమ్ముచున్నాను. భారతీయులలో ఒకవిధమగు ఐకమత్యమేర్పడుట, ప్రపంచమున భారతదేశమునకుగల హోదాను వారుగుర్తెరుగుట సంభవింపవచ్చును.

ఇట్టిప్రయత్నములు ఇప్పటినుండియే ప్రారంభమైన యుద్ధానంతము ఎట్టి కాలహరణములేక క్రొత్తఇండియా ప్రభుత్వమేర్పడవచ్చును. ఇదంతయు భారతీయులే తమలోతాము ఏకాభిప్రాయము కుదుర్చుకొని చేయవలసినకార్యమని గుర్తెరుగవలెను. అయినను ఈవిషయమున ప్రభుత్వమువారు, ఎట్టిజోక్యము కలుగజేసుకొనక దూరముగనుండవలయునను ఉద్దేశ్యములేదు. మనము పాలితులము [భారతీయులు] పాలితులు అనుభావమును వదలి సమానులకు సలహా ఇచ్చువిధమున బ్రిటిషు ప్రభుత్వమువారు భారతీయులకు ఈవిషయమున అన్నివిధముల తోడ్పడుచుండెదరు. బ్రిటనుకోరికలను భారతదేశముపై నిర్బంధించవలయునను అభిప్రాయములేదని స్పష్టపరుపబడును. భారతదేశమునందలి భిన్నాభిప్రాయములను సమన్వయమొనర్చుటయే బ్రిటను ఉద్దేశ్యమని స్పష్టముగ తెలుపబడును. ప్రస్తుతము భారతదేశములో భిన్నాభిప్రాయములు ప్రబలియున్నవి. వీటిని మలికనచేయుటకు వీలులేదు. ఈవిభేదములు ఈదేశమందువలె కేవలము తాత్కాలికమైనవని తలచుటకు వీలులేదు. ఈవిభేదములన్నిటిని సమన్వయమొనర్చి భారత భావిరాజ్యాంగ నిర్మాణమును సృష్టింపవలసియున్నది.

## ఔరంగాబాదులో వైస్రాయిగారి పర్యటనము

హైదరాబాద్, ఆగష్టు ౧౯

వైస్రాయ్‌గారు ఔరంగాబాదుకు విజయముచేసినప్పుడు జిల్లాపోలీసుల ఏర్పాట్లు బాగుండెను. నిన్న ఉదయము వైస్రాయ్‌గారు రైల్వేహోటలులో భుజించిరి. ఔరంగాబాదు సూబేదారుగారు, కొత్వాలిసదరుసజంగారు, అవ్వల్ తాలూకుదారుగారు మరియు ఆనరబిల్ రెసిడెంట్‌గారు, ఆనరబిల్ ప్రధానమంత్రిగారు, వారికన్ని ధానవర్తులుగానుండిరి.

భోజనమునకుపిమ్మట వైస్రాయిగారు తమపరివారముతో నైజాం ప్రభుత్వఉన్నతోద్యోగులతో యెల్లోరా గుహలు పర్యవేక్షణచేయుటకు బయలుదేరిరి. ఖుల్దాబాదుదగ్గర ప్రజలు వారి ఆగమనమునుగూర్చి గొప్ప హర్షధ్వానులుచేసిరి. అందుకు వైస్రాయిగారు తమసంతోషాభిప్రాయమును తెలిపిరి.

ఖుల్దాబాదునుండి దౌలతాబాదు మీదుగా యెల్లోరాకువిజయముచేసిరి. అచ్చట ఆర్కియాలజీ శాఖాధికారిగారును యెల్లోరగుహ మొహతమీముగారును, వైస్రాయ్‌గారికి స్వాగత మొసగిరి.

వైస్రాయిగారు చాలఅభిలాషతో యెల్లోరయందలి శిల్పనైపుణ్యమును, చిత్రములను పర్యవేక్షణచేసిరి ఆటనుండి కైలాసనాథాలయమును గూడ పర్యవేక్షణచేసిరి. యెల్లోరాగుహలలో విద్యుద్దీపప్రకాశమేర్పాటుచేసియుండిరి. ప్రపంచములోని విచిత్రశిల్పచాతుర్య నిర్మాణాలలో ఇవియున్నయని వైస్రాయిగారు సెలవిచ్చిరి. ఔరంగాబాదు చారిత్రకస్థల విషయములనుగూర్చి తమసంతోషమును వెలిబుచ్చిరి. తమసన్నిధానవర్తులుగానుండిన ప్రధానోద్యోగుల ఏర్పాటులను ప్రశంసించి, వారు ఆటునుండి ఆసిఫాబాదుకు పోయిరి.

ఔరంగబాదులో తమస్టాఫుతోగూడ రెండుదినములు ఉండిపిమ్మట అటనుండి స్పెషల్ ట్రైనులో ఢిల్లీకి ప్రయాణమైపోయిరి. ప్రయాణ సందర్భమున ఘనమగు వీడ్కోలు జరిగెను.

## అసురచింత సంస్థానము

హైదరాబాదు(దక్కన్) మెహరు ౧౬

ఈ సంస్థానానికి హైదరాబాదు ప్రభుత్వమువారు జిల్లాఅధికారాలు ఇచ్చినారు. న్యాయస్థానానికి నాజం జిల్లాఅధికారంఇచ్చి ఇదివరలో మున్సిఫ్ పనిచేయుచుండిన మాణిక ప్రసాదుగారిని నాజింగా ఏర్పాటుచేసినారు. నరసింహాచారిఅనేవారిని మున్సిఫ్‌గా క్రొత్తగానియమించినారు.

## ప్రకటించబడని వ్రాతలు

ఈక్రింది విషయములనుగూర్చి వ్రాసి చేరియున్న వ్రాతలను మేము ప్రకటింపజాలమని విచారపడుచున్నాము

౧) భువనగిరిలో శాంతిపూజలు

౨) నల్లగొండలో వ్యాగిన్ కరల దౌర్జన్యము (సంతకములేదు)

౩) గోల్కొండ జాగీరులో భజనసప్తాహము

౪) మెదకుజిల్లా ఎల్లారెడ్డితాలూకా పట్టిలింగంపేట చుట్టుపట్ల పల్లెటూరు ప్రజలస్థితి

౫) రంగారెడ్డిగారి బహిరంగలేఖకు సమాధానము

౬) బాల్యవివాహ నిషేధముతోపాటు వరకట్నమునుగూడ తొలగించుశాసనము కావలెనను మొఱ

౭) సంగారెడ్డిపేటలో ధర్మశాల నిర్మాణము (వ్రాతలోని విషయములు సరిగా తెలియుటలేదు)

౮) నల్లగొండ విద్యార్థుల మొఱలు [సంతకము లేదు]

౧౦) మధిరతాలూకా కర్నుపల్లి గ్రామపంచాయతీదారుని ఎన్నిక క్రైస్తవ్యక్తినిగూర్చిన శిఫారసు

౧౧) "గోలకొండ పత్రపాతము"ను గూర్చి శ్రీవంగపల్లి నీలకంఠంగారికి వి. ఎన్. దీనబంధుగారి సమాధానము [ఈచర్చ అనవసరము]

౧౨) ఎల్లారెడ్డితాలూకా నాగారెడ్డిపేటలో ఒక వైశ్యకుటుంబములోని కలహవివాదములు

## నిజాం రైల్వేవారి యుద్ధసహాయము

హైదరాబాదు (దక్కన్) మెహరు ౧౬

నిజాంస్టేటు రైల్వే కర్మాగారాలన్నీ యిప్పుడు యుద్ధసామగ్రి సిద్ధముచేయుటవిగా మారినవి దానికి పబ్లిక్‌వర్కు శాఖయునుగూడ సాయపడుచున్నది మరియు కంబళ్లు సిద్ధముచేయించుటలో పరిశ్రమ వ్యాపారశాఖగూడ సహాయపడుచున్నది

## హెల్తు ఆఫీసర్ల శిక్షణ

హైదరాబాదు(దక్కన్) మెహరు ౧౬

ప్రభుత్వప్రకటనశాఖవారిట్లు తెలుపుచున్నారు ఆరోగ్యవిచారణకై కొందరుద్యోగులు హైద్రాబాదు ప్రభుత్వానికి కావలెను. ఇదివరలో బొంబాయికి ఏటేట ముగ్గురినిపంపి ౧౩౦౦ రూ॥ ఖర్చుచేసి శిక్షణ యిప్పించుచుండెను ఇకముందు హైద్రాబాదులోనే శిక్షణ యిప్పింతురు

బొంబాయిలో స్యానిటరీ ఆఫీసర్ పనికి ౬ నెలల శిక్షణకలదు. కాని మేమింకా బాగ నేర్పించుటకై ౧ సంవత్సరమువరకు చదివింతుము. బొంబాయిలో అయినఖర్చులో ఇచ్చట ౧౦మందికి తర్ఫీదును ఇప్పించవచ్చును,

## హరిజన ప్రియులైన భూస్వాములు

అత్రాఫుబల్దా జిల్లా మేడిచల్ తాలూకాకు సంబంధించిన రాయరావుపేట, జమీలపేట మరియు చుట్టుపట్ల గ్రామములలో యీపుష్యమి కార్తినుండి సకాలమునకు వర్షములు కురియుచున్నవి. చెరువుకుంటలునిండునంత నీరు రాకున్నను సద్ద,జొన్న మొక్కజొన్న మున్నగు పునాసపైరులకుమాత్రము చాలఅనుకూలములగు వర్షములు కురియుచున్నవి. పశువులపచ్చికబాధ దూరమైపోయినది. ఈ సంవత్సరము కాలమానము సుభిక్షముగాయున్నదని రైతులు మున్నగువారనుకొనుచున్నారు. ప్రజాహితసంస్థలు, సంఘములు మరియుసభలు మున్నగువాటికొరకు ఒకరు సంస్థదర్శకులుగాయుండుట ముఖ్యముగదా ఇదేప్రకారము మాయీరెండు గ్రామములకు నొకరు హరిజనప్రియులై ప్రజాసేవయే పరమధర్మమని మాన్యనీయులైనందులకుఫలితముగా పలుకుబడిగలభూస్వాములు, రైతులు, యింకాఇతరసాహుకారు ప్రజలందరు మాలమాదిగల అంటుముట్టు వారిని గూర్చిన అజ్ఞానాంధకారమును పారద్రోలి, వారిని తమతోను మోటబావులలో నీరుగొనిపోవుటకు యెట్టిఆటంకములు కల్పించక, తినుటకు ఇనాము భూములనిప్పించి వారిని ఉద్ధరించుచున్నారు. వారి సేవలు ... మాలమాదిగలకు, మరియుతదితర బీదసాదలకు ... బత్తెములు ... గానిచ్చి వారిని తమకన్న బిడ్డలవలె ... యనుచున్నారు ... ము అప్పగాయిచ్చినను వి ... తీసికొనరు ... ఇట్టి ... భూస్వాములలో ... సంతోషము. ... వర్ణించుట ...

కే. ఎన్. దీనబంధు

# గోండులు-వారియాచారాలు

## ధైర్యప్రధానమగుజాతి

ఆసిఫాబాదు, మొహరం ౧౩

ఆసిఫాబాద (జనగాము) జిల్లా హైదరాబాదు రాజ్యములోని తెలంగాణా ప్రాంతమునకు తుదిజిల్లా. ఈజిల్లాలో మొత్తం పదితాలూకాలుగలవు. కొన్ని సంవత్సరములకుపూర్వము భోస్లామరాఠారాజాగారి అధీనములోను అంతకుపూర్వము, గోండ్ రాజుల అధీనములోనుండినట్లు ఇతిహాసములుగోచరించుచున్నవి. దాదాపు ౩౦౦ సంవత్సరములక్రితము యీగ్రామము రాజధానిగా నుండినట్లువినికిడి. ఇచటిగోండ్ రాజులలో పేరుప్రసిద్ధికెక్కినవారు అంకుమరాజు. అరోజులలోనిప్రజలు, విశేషముగాగోండవారలు తమరాజును దేవునివలె భావించుచుండుట ఆనాటి ప్రభుభక్తితోనుండెను. ఇప్పటికిని మనము శ్రీరామచంద్రులవారిని దేవునిగా పూజించుచుండుటచేనా? ఏకాలమునందేకాని ప్రభువుతమ ప్రజలపై ప్రేమగల్గినవారైన, ప్రజలుఅతనినిదేవునితో సమముగా చూచుటసహజము అయితేపైన పేర్కొనబడిన అంకుమరాజులవారు గొప్పరాజగుటచే ఆగనిపేర నొక దేవాలయమునిర్మింపబడి నేటివరకు ప్రతిసంవత్సరము పొలాలపండుగనాడు, యొక్కా ఈదేవాలయముచుట్టు ప్రదక్షిణగావింపజేసి, ఘనాభిషేకమునుగావింపజేయుదురు ఈదేవాలయము ప్రాతదవుటచే మంజూర్ జంగ్ తాలూక్దార్ గారి కాలములో చందాలవసూలుకాజంపబడి, బాగుచేయుటకై ప్రయత్నములుగావింపబడియుండెను. గాని తాలూక్దార్ గారి తబాదులాకముపరి గుత్తేదారు ఆ చందాలకమునుతీసికొని పారిపోయెను. ఇప్పటికి మిగుల శిథిలావస్థలోగలదు ఈ అంకుమరాజు గారికాలమునందు ప్రజలందరును సుఖశాంతులతో నుండెడి శాశ్వతానందములకు మేరలేకుండెను.

నేటివరకువీరి చరిత్ర బహువిచిత్రముగానున్నది. పొటరూపము గానుండుటచే కోలాటసందర్భములందు యీగోండజాతివారలు పాడుచుందురు. నేటివరకు యీరాజాగారి వంశస్థులు యీజిల్లాలోని ఉట్నూర్ తాలూకాలో విశేషముగాను, అసిఫాబాద, రాజూరా, సిర్పూర్ (కాగజ్ నగర్) మున్నగుతాలూకాలలో సామాన్యముగాగలరు వీరిమాతృభాష గోండను. లిపిలేకుండుటచే దేవలిపియైనట్టి హిందీలిపిని చాండా, ఎరామున్నగు సంస్థానమునందలి గోండరాజులు వాడుచుండుటకలదు.

విశేషముగా యీగోండవారలు అడవులలోను గుట్టప్రదేశములందు చిన్నచిన్న పల్లెలగావించుకొని నివసించియుండుటవాడుక. వారువ్యవసాయము తమవృత్తిగాజేసికొని తమజీవనోపాయములగావించుకొనుచుండుట వాడుక ఆటవిజాతులలో మన్నె మరియు కోయ మున్నగు వర్గములు గలవారలుకూడగలరు వీరు సాహుకార్లవద్ద వడ్డీపైన రూపాయలుగైకొని పంటలసందర్భమున దినుసురూపకముగనైనను ధనరూపకముగనైనను తీర్చుచుండుటవాడుక. విద్యరాకుండినను వీరిలోగలమర్యాద, అతిథిసత్కారము, ఐకమత్యత, మున్నగునవి ప్రశంసనీయములు. వీరు పులులను కుక్కలతరిమినట్లు తరిమివేయుదురు. వీరిసత్యము, న్యాయము, దయ, ధర్మనిష్ఠత, ధైర్యసాహసములుగొప్పవి. అవిద్యాంధకారమువలన మిగులకష్టనిష్ఠురములను పొలగుచుండుట గలదు.

వీరిలో దరిద్రతవ్యాపించి వివిధకష్టములకు పాలవుచున్నారు. మహాత్మునివలె ఒకచేచిన్నగుడ్డ పురుషులును స్త్రీలును కట్టుకొనుచుందురు. పురుషులలో హెక్కుగా దరిద్రతవ్యాపించుటచే గోచికట్టుకొనియుందురు

వీరుమిగులవేట్కప్రియులు విచిత్రమేమిటంటే వీరుసర్పములనుకూడా భుజింతురు.

వీరుండుగుడిసెలుగడ్డివి. రాత్రిసమయములందు చిరుతపుల్ల భయమెప్పుడెప్పుడుండును. చిరుతపులులు గుడిసెలపైకెక్కి దిడ్డిగావించుకొని లోపలిభాగమునచేరి పిల్లలను లాగుకొనిపోవుట జరుగుచుండును. కావున ఆయాప్రదేశములలో కొంతవరకు పురుషులును కొంతవరకు స్త్రీలును జాగరణజేయుచుందురు. వీరిధైర్యమేమీరిధనము. కఱవుకాలములందు గడ్డ, బెడ్డ, అడవిదుంపలు, పండ్లు, ఫలములతిని జీవనముల గడుపుచుందురు గతసంవత్సరము కంకబీజములపై జీవనములగడపినసంగతి పెక్కురకువిదితమైయే యుండవచ్చును

ఈ గోండకులమువారలలో స్త్రీలు రవికెలనువాడరు. రాజగోండ, మరియుగోండవని రెండుతెగలుగలవు రాజగోండ చెప్పినప్రకారము యితరగోండులు వర్తించుటకలదు. రాజగోండులు బ్రాహ్మణులవద్దకూడా భుజించ నిష్టపడరు.

వీరుగొప్ప శైవారాధకులు. వీరికి, పోచమ్మ, మైసమ్మ, భవాని మున్నగుదేవతలపైన భక్తి మెండు. వీరుగొప్ప మూఢవిశ్వాసము గలవారలు.

వీరు గ్రామపల్లెలలో యేపని అయినచెప్ప ఎక్కువయిద్దరు-దుట అరుదు వీరు అపరిమితశక్తిమంతులు. వీరుతమప్రాణములనైనను విడనాడుటకుజంకరు కానిధర్మమును ఆచారములను విడనాడరు వీరిలో యెప్పుడేలాంటి కలహములుజరిగినను న్యాయస్థానమునకార్యాయి పెట్టుకొనక తమపెద్దవారు ఆజ్ఞనొసగినప్రకారము అంగీకరింతురు. వీరుపరుండుట భూమిపైన చలికాలమురాత్రులు నెగళ్ళను గావించుకొని వాటిప్రక్కనపరుండి రాత్రులు గడుపుచుండుటగలదు.

వీరుఆడినమాటతప్పరు. వీరడిస్థాపరులు కృతఘ్నతనొకరినిహింసించరు. విశుద్ధస్వభావులతో తప్పనిచయితరులతో విరోధము గావించుకొనరుందురు.

వీరివివాహములు మిగులవిచిత్రముగాజరుపబడును-వంటచెరకులకైనను, నీటికైనను వెళ్ళునట్టి స్త్రీయొక్క హస్తమునుపట్టుకొనిన అదిఅతనియొక్క భార్యయనబడును. కాని ఆ స్త్రీతో నుండు యితరస్త్రీలు కట్టెలతోను రాళ్ళతోను పురుషునికొట్టి వెళ్ళగొట్టప్రయత్నింతురు- వాటినిసహించుకొని అకన్యను గైకొనిపోయినచో వాడు పురుషార్థియనబడును-తక్షణమే వారివివాహముగావింపబడును- ఒకవేళ హస్తముపట్టినవాడు దెబ్బలకు తాళలేక పారిపోయినచో వాడు పిరికిపోతుయనబడును- ప్రతిచోట వానిని హేళనగావింతురు.

ఈరాజాయొక్క వంశీయుడైన రాజాజల్పతరావుగారు ప్రస్తుతము తాలూకా ఉట్నూరాలోనున్నారు మంచిధనికులు.

పైపేర్కొనబడిన అంకుమరాజులవారి జీవితచరిత్ర కావ్యరూపముగాలభించగలదు- వీరికి తనముకలవాడు మోక్షమును పొందజాలడని యీగోండలనమ్మకము- వీరెచటికివెళ్ళినను ఒక కర్రనుగైకొని వెళ్లుదురు- అకర్రను యెవరైన అడిగినయెడల మండిపడుదురు-ఎందుకనగా చేతిలోనికర్రనుయిచ్చిన భార్యనిచ్చినట్లని వారిభావము-వీరిలో కులమతవిచక్షణాలు లేకుండినను తమఆచారములనుమరువరు- మతసైన్యములు తేనేలేవు-ఇతరమతముల స్వీకరించుటకును, భోజనములగావించుటకును యెప్పుడూ యిష్టపడరు- అంతేగాదు గొప్ప కరువుకాలమునందుకూడా భిక్షాందేహియనుటకు యిష్టపడరు-

వీరికి సాహుకారులు వడ్డీలకు పైకమిచ్చి వేధపెట్టుదురు-వీరుఅడవులందే విశేషంగా ఉండేవారుకాన అడవిశాఖవారి చౌకీదార్లను గురియగుదురు-కొందరు చౌకీదార్లచే వీరికిబాధలుకలుగును-అవన్నియువ్రాయుటకు వీలులేదు- ఈ గోండుజాతినుద్ధరించుటకై వారిభాషలోనే ప్రాథమికపాఠశాల ప్రభుత్వమువా రేర్పాటుచేసిన బాగుండును.

ఇట్లు

జీ. యస్. గుప్త

ఆసిఫాబాదు

(గమనిక,—ఈవిలేఖకుడు అంకమహారాజు చరిత్రకావ్యరూపముగా లభింపకలదని వ్రాసినాడు-ఏభాషలోకలదు? ముద్రితమా, అముద్రితమా? ఎక్కడలభించును- ఈజావివరాలు ఆచారముతోనిలింకను తెలుసుకొనివ్రాయుట బాగుండును- గో-ప-సం)

చదవండి!

నేడే సభ్యులుగా చేరండి!

# కాంగ్రెసువారు రాకున్న ఇతరులతో పనిసాగించుదము

## ఇండియాలో బ్రిటిషు ప్రభుత్వ ప్రత్యేక బాధ్యతలను వదలజాలము.

పార్లమెంటు కామన్సుసభలో అమెరీగారి ఉపన్యాసములు

ఈ అగస్టు ౧౪వ తేదివాడు బ్రిటిషు పార్లమెంటు కామన్సుసభలో ఇండియా సెక్రెటరీ ఆఫ్ స్టేట్ అగు అమెరీగారు ఇండియా రాజ్యాంగ నిర్మాణమునుగురించి చెప్పినఉపన్యాసముయొక్క భాగములు దిగువముద్రించబడినవి:—

**కాంగ్రెసు ప్రశంస**

కాంగ్రెసు నాయకులు గొప్పదేశభక్తిగలవారు. వారునిర్మించిన రాజకీయసంస్థ అన్నివిధముల సౌష్ఠవముగలది. ఇట్టిసంస్థనునిర్మించినందులకువారు గర్వపడవచ్చును. భారతజాతీయజీవితమున అన్నివర్గములకు కాంగ్రెసు ప్రతినిధి సంస్థయని కాంగ్రెసునాయకులు చెప్పుచున్నారు. ఈ విధమున కాంగ్రెసు మహాసభ అన్ని వర్గములకు ప్రతినిధిసంస్థయై, అన్నిపక్షములవారి అభిప్రాయములను ప్రకటించునదిగ నుండిన ఎట్టిచిక్కులేకుండెడిది. కాంగ్రెసుసంస్థకోరుహక్కులను బ్రిటిషు ప్రభుత్వమువారు భారతదేశమున కివ్వవలసియుండెడిది. భారతదేశములో కాంగ్రెసువంటి బలవంతమైన రాజకీయపక్షము మరొకటిలేదు. అయినను అన్నిపక్షములకు వర్గములకు ఇదియే ప్రతినిధి సంస్థయనిచెప్పుటకువీలులేదు. పెక్కుపక్షములు సంస్థలు కాంగ్రెసు నాయకత్వమును అంగీకరింపక తమప్రత్యేకపు హక్కులను ఆదరింపవలయునని కోరుచున్నవి. (పిమ్మట అమెరీగారు మహమ్మదీయులు, నిమ్నజాతులు, సంస్థానాధీశులు కాంగ్రెసుతో ఏకీభవించుటలేదనిరి).

**నిమ్నజాతులు**

భారతదేశమునందలి నిమ్నజాతుల వైఖరియు ఈవిధముగనేయున్నది. గాంధిగారు నిమ్నజాత్యుద్ధరణమై కృషిసలుపుచున్నను నిమ్నజాతులు హిందూసంఘమునచేరక వేరుగనేయున్నారు. హిందూసంస్థయగు కాంగ్రెసునకు వారు దూరముగ నేయున్నారు.

**ఈ విభేదములను సర్దవచ్చును**

భారతదేశపు రాజ్యాంగసమస్యనుగురించి చర్చించునప్పుడు ఈవిషయములన్నిటినిదృష్టియందుంచుకొనవలెను. ఈవిభేదములు శాశ్వతమైనవనియు సర్దుటకు వీలులేనివనియు తలపకూడదు. భారతదేశము పరిపూర్ణమైన ప్రత్యేక ఖండమువిధముగను అంగీకరించవలెను. భారతదేశపు నాగరికతచరిత్ర అతిప్రాచీనమైనది. ఈనాగరికచరిత్ర భారతీయులకందరకు సమానమైనదే భారతజాతికి చేరినవాడనని ప్రతిభారతీయుడును సగర్వముగువిధమున చెప్పుకొనుచున్నాడు. అస్సఫర్డు విశ్వవిద్యాలయముచే గొప్పగా గౌరవింపబడిన రవీంద్రనాధునిజాతికి చేరినవాడని గర్వముతో చెప్పుకొన నిష్టపడని భారతీయులెందరు ఈదేశమునందుకలరు భారతదేశములో అన్నివిధముల ఏకాదర్శముగల జాతీయత ఏర్పడుటకు వీలులేకున్నను, భారతదేశ జాతీయైక్యత కుదురుటకు ఎట్టి ఆటంకములేదు. భారతదేశపు స్వాతంత్ర్యమహాశోభమున భిన్నదృక్పథములు గలవారుండుటకు పూర్తిఅవకాశములున్నవి.

ప్రస్తుతము అమలునందున్న పద్ధతులననుసరించి నూతనముగ ఏర్పరుపబడు కార్యవర్గము గవర్నరుజనరలుగారి బాధ్యతకు లోబడియుండవలయునేగాని శాసనసభకు బాధ్యతవహింపలేదు, కేంద్రమున జాతీయప్రభుత్వము ఏర్పడవలయుననియు, ఈప్రభుత్వవర్గము శాసనసభలోని అన్ని పక్షముల విశ్వాసమును పొందినదిగ యుండవలయుననియు కాంగ్రెసువారుకోరిరి. నూతనసభ్యులను నియమించుసందర్భమున వైస్రాయి వివిధ పక్షముల విశ్వాసమునుపొందినవారినే తమకార్యవర్గమున చేయుటకాహ్వానించెదరు. కానికాంగ్రెసువారుకోరినవిధమున భారతశాసనసభలోఎన్నుకోబడిన సభ్యులవిశ్వాసమునుపొందినవారే కార్యవర్గపుసభ్యులుగ నియమింపబడవలయునను నిర్బధమున్న యుద్ధసమయమున ఇండియాప్రభుత్వనిర్మాణమునే పూర్తిగమార్చుటయగును. రాజ్యాంగనిర్మాణ సమస్య విషయమై దేశములో తీవ్రమగుభిన్నాభిప్రాయములున్నవని నేనుఇదివరకేసభ్యులకువిశదపరచితిని. కాంగ్రెసు కోరికకు అల్పసంఖ్యాకులు విముఖులుగనున్నారు. శాసనసభనిర్మాణమునుగురించియు రాజ్యాంగనిర్మాణమునుగురించియువివిధపక్షములవారికిఏకాభిప్రాయముకుదిరినపిమ్మటనే శాసనసభ్యులవిశ్వాసముగల ప్రభుత్వవర్గమేర్పరచుటకు వీలగును. కావున వైస్రాయి సూచనవంగీకరించిన భారత నాయకులు కేంద్రప్రభుత్వనిర్వహణమున పాల్గొనుటకు, యుద్ధకార్యనిర్వహణమున తమ పలుకుబడి నుపయోగించుటకు పూర్తిఅవకాశముకలుగును. రాజకీయములందు తమ అభిప్రాయములను ఆదర్శములను మార్చుకొనవలసినఅవసరముండదు ప్రస్తుతపుఅపసరస్థితులలో భారతదేశపు శ్రేయముకొరకు అన్నిపక్షముల నాయకులు కలిసి పనిచేయుటకువీలగును. కాంగ్రెసుపక్షమువారివైఖరి ఆశాభంగకరముగ నున్నది కాంగ్రెసు నాయకులు వైస్రాయిసూచనలకు అంగీకరించితోడ్పడెదరని యిప్పటికిని నమ్ముచున్నాను. కాని విధివశమున కాంగ్రెసువారు వేరువిధంగా తీర్మానించుకొనిన, తమకు తోడ్పడసిద్ధముగనున్న ఇతరసహాయముతో వైస్రాయిగారు తాను ప్రకటించిన విధానమును అమలులోనికి తెచ్చెదరు.

**అధినివేశ ప్రతిపత్తి**

కార్యవర్గపు సభ్యులసంఖ్యనుఅధికము చేయుట యుద్ధ కార్యనిర్వహణమున భారతీయుల సహకారము పొందుటతోపాటు భారతీయుల రాజకీయఆదర్శములను సాధ్యమైనంతత్వరలో సఫలముగుట వైస్రాయిగారు కొన్ని సూచనలు గావించిరి. అధినివేశప్రతిపత్తిని భారతదేశమునకొసగుట యనగా బ్రిటిషుకామనువెల్తులో భారతదేశమునకు సమానభాగస్వామ్యము నొసగుట యగును. అధినివేశప్రతిపత్తిని సంపూర్ణ స్వాతంత్ర్యపుహోదాకన్న తక్కువదియైనదని కొందరుతలంచుచున్నారు. బ్రిటిషు కామనువెల్తులో డొమినియనులకున్న హోదా ప్రపంచములో మరియేఇతర రాజ్యమునకులేదు స్వాతంత్ర్యముగ నలిఫహరింపబడుచున్న ఇతర భూభాగాలలోని ప్రజలుఅనుభవించుచున్న స్వాతంత్ర్యహక్కులను అనుభవించుటలేదు. చుట్టుప్రక్కలనున్న బలవంతములైనరాజ్యములదౌర్జన్యమునకు ఈస్వాతంత్ర్య రాజ్యములుగురియగుచున్నవి బ్రిటిష్ కామనువెల్తుకుచేరినరాజ్యములు స్వాతంత్ర్యముతో భద్రత ఐశ్వర్యములనుకూడ అనుభవించుచున్నవి.

**ఇండియాకు ఇతరడొమినియనులకు భేదము స్థితి**

అయినను ఇంకాకొన్నిచోట్ల మాఉద్దేశ్యము నిజమేనాఅని కొందరు సందేహించుచున్నారు. ఎప్పుడుఏవిధముగా నెరవేర్తురని ప్రశ్నలువచ్చినవి. ఆప్రశ్నలుఅడుగుట అస్వాభావికము కాదు ఆప్రశ్నకిప్పుడు వైస్రాయి గారు, రాజాగారి ప్రభుత్వపు సంపూర్ణామోదము పొంది, సమాధానమిచ్చినారు ఇవిఅంగీకృతమైన లక్ష్యమునుచేరుటకొకగొప్ప అంజయని నాభావము వైస్రాయి గారిప్రకటనలో అతిఅర్థవంతమైన ఒకభాగమును నేనుఉల్లేఖించెదను "ఇండియాకునూతన రాజ్యాంగప్రణాళికను తయారుచేయు బాధ్యత ప్రధానముగా భారతీయులదేయైయుండవలసినదనియు, భారతీయసాంఘిక, ఆర్థిక, రాజకీయజీవితనిర్మాణము ఎట్లుఉండవలెనని భారతీయులు కోరుటలోఉంటుందో తదనుగుణ్యముగ ఆప్రణాళిక ఉండవలసినదనియు, చాలాపట్టుదల చూపబడినది రాజాగారిప్రభుత్వమునకు ఆకోరికయందు సానుభూతికలదు, బ్రిటనుకు చరిత్రసంక్రాంత బాధ్యతలుకొన్ని ఏర్పడినవి. ఆబాధ్యతలను రాజాగారిప్రభుత్వము తొలగించుకొనజాలదు. వాటి నిర్వహణకు తగినఏర్పాటులు చేయబడునే వరకుకులోబడి, భారతీయులపైకోరిక పరిపూర్ణముగా తీర్చబడగలదని బ్రిటిషు ప్రభుత్వము వారియుద్దేశ్యము"

ఈ బాధ్యతలనుస్మరించుటవల్ల స్థితిఏమాత్రం తగ్గదు-అందుచే ఇప్పుడు ఇండియాఉండుస్థితికిని తక్కినడొమినియనుల స్థితికిని చరిత్రాలలోను, భూగోళములోను ఉండుభేదమును నిరూపించు అంశములను గుర్తించుటమాత్రమే యగును—౧౯౩౬లో సామ్రాజ్యసమాలోచనసభకువారుపంపిన రాజ్యాంగప్రణాళిక నివేదికలో కీర్తిశేషులైన బాల్ఫోరుప్రభువుగారు బ్రిటిషుకామన్వెల్తు సంబంధములగురించి అద్భుతరీతిగ తెలిపినట్లు "ప్రతిపత్తికిఅనుగుణమైన సమానత, సరూపతఅనునూత్రములు, సర్వకార్యాధికారమునకు వర్తించవు. ముఖ్యముగా, వారుఈసందర్భమున దేశరక్షణ, విదేశాంగవిధానమును ఉదహరించిరి-ఉదాహరణను, ఈ రెండువిషయములలోనే, చారిత్రకముగానుండు వైశేష్యవస్థలను, భూగోళస్థితులవల్లను, ఇండియాస్థితి తక్కిన అధినివేశరాజ్యములకన్న భిన్నముగానున్నది- ఇటువంటిబాధ్యతలవల్ల కలిగెడి విభేదముమాత్రము కేవలము పోవాలికుగాని వాస్తవముకాదు-ఏలన, ప్రతిడొమినియనువిషయములోను బ్రిటిషు బాధ్యతలకు ప్రత్యక్షలాంఛనముతోనైతేనేమి, అప్రత్యక్షముగానైతేనేమి కొంతసర్దుబాటుజరిగినది-ఈ అంశములకులోబడి, ఇండియారాజ్యాంగప్రణాళికను, భారతసాంఘికఆర్థిక, రాజకీయభావానుగుణ్యముగ భారతీయులే తయారుచేసికొనవలెనని బ్రిటిషుప్రభుత్వమువారి దృఢమైన సంకల్పము-

**ఆచరణవిధానము**

ఆకార్యమునకు యుద్ధానంతరము సాధ్యమైనంతత్వరగా, అనవసరాలస్యములేకుండా, "భారతజాతీయజీవితములో ముఖ్యభాగములైనవారి ప్రతినిధులుగల ఒకసంఘము"అనగా, భారతీయులలో ముఖ్యసంఘముల ప్రతినిధుల పరస్పరాంగీకారముతో ఏర్పాటుచేయబడిన సంఘము

(రావ పేజీమాడుడు)

## ఆమెరీగారి ఉపన్యాసము

(౭వ పేజీతరువాయి)

పూనుకొనును. అది ఎంతపనికిమాలినదైనను ఒక్కభాగమునకుమాత్రమేనచ్చి, అల్పసంఖ్యాకులకు బొత్తుగా అనంగీకారమైనట్లుండగల సంఘముకాదు-ఈవిషయము బ్రిటిషుప్రభుత్వము బాగుగా స్పష్టపరచినది ఇండియాశాంతి, క్షేమములకు తామిప్పుడువహించుచున్న బాధ్యతను భారతజాతీయ జీవితములో పెద్దబలిష్టమైనఒకపక్షము ప్రత్యక్షముగా తృణీకరించు ఏప్రభుత్వపద్ధతికిగాని బ్రిటిషు ప్రభుత్వము వదలివేయజాలదు. ఈవిషయము లోకూడ ప్రతిఅధివేశ రాజ్యాంగ ప్రణాళికను నిర్మాణములో అవలంబింపబడిన సూత్రములను విడనాడుటలేదు. డొమినియనులలో ప్రతిదియు రాజ్యాంగ ప్రణాళిక తయారుచేయుటకు ముందుప్రాంతీయ వర్గములకును, ముఖ్యజాతీయవర్గములకును (కెనడాలో బ్రిటిషువారికి, ఫ్రెంచివారికి దక్షిణాఫ్రికాలో బ్రిటిషువారికి, బోయరువారికి) రాజ్యాంగప్రణాళిక తయారుచేయుపద్ధతినిగురించియు, అసలు రాజ్యాంగ ప్రణాళికనుగురించియు, ఒప్పందము జరిగినది. ఒప్పందము అంగీకారము నిజముగా సర్వస్వతంత్ర ప్రభుత్వమునకును, సర్వసత్యమైన ప్రజాస్వామ్యమునకును పునాది, అధికసంఖ్యాకనిర్ణయము ప్రజాస్వామ్యసారముకాదు. కేవలము ఆచరణ సౌలభ్యముమాత్రమే. తొలుతనే, రాజ్యాంగమునుగురించి సామాన్యముగా అందరును అంగీకరించినారని దానిభావము. అనేక ఫెడరలు రాజ్యాంగములలో ఫెడరేషనులో చేసినవివిధభాగముల ప్రత్యేక హక్కురక్షణకుగాను ఈఅధికసంఖ్యాక నిర్ణయము అనేకవిధాల సంకుచితపరచబడినది అట్టిఒప్పందమును రాజ్యాంగాభివృద్ధి సరిగట్టుటయని చెప్పుట అందుకుసంబంధించినవారి దేశభక్తికి, బాధ్యతాభావమునకు అన్యాయము చేయుటయగునని నాభావము. ఒప్పందమంటే ఏ ఒక్కవర్గమును అడ్డుకల్పించుచున్నదనికాక, సమాధానము కుదుర్చుకొనుటన్నమాట, సమాధానమునకు యిష్టపడుటయనునదిఇతరదేశములలోవలెనే ఇండియాలోకూడ స్వతంత్రప్రభుత్వము దేనిపై ఆధారపడుతుందో అబాధ్యతాభావమునకుపరీక్ష ఒప్పందముకుదరవలసిన అవసరమునకులోబడి యావత్తు రాజ్యాంగము పునర్విమర్శనము చేయవచ్చును

ఎప్పుడు

ఎప్పుడుఅను విషయముకూడా పట్టుదలగానే అడుగుచున్నారు. దీనికి సెక్రెటరీగారి ప్రకటనలోనివ్వబడినజవాబు స్పష్టముగా నున్నది. ఈ పెద్దరాజ్యాంగసమస్యలను విశ్వతముగాపరిష్కరించుట, క్రొత్తప్రభుత్వపద్ధతిని ఏర్పాటుచేయుట మనము చావుబ్రతుకులపోరాటములో దిగియుండేయీసమయములో సాధ్యపడవు, యుద్ధానంతరం ఎంతత్వరగాసాధ్యపడునదేది ఇండియాచేతులలోనేయున్నది. ఈప్రధానసమస్యలు సులభంగాపరిష్కారంకాదనుట ప్రతి డొమినియనుఅనుభవము ఇండియాకు ప్రత్యేకంగాఉండేసమస్యలకష్టము చిక్కులుగురించినేనుకదవారికిచెప్పినాను అవిచూడగా ఇండియాఅనుభవము తక్కినడొమినియనుల అనుభవముకంటె వేరుగానుండగలదనితోచదు. అసలునిర్ణయములుచేయు సభలుజరుగుటకుపూర్వము ఎంతో ప్రాథమికచర్చ, విచారణ, రాయబారము సాగవలసియుండును ఈకార్యము యుద్ధానంతరముకరకు నిలిచియుండవలసినఅవసరములేదు. అదిఇప్పుడు ఎంతపరిపూర్ణముగాజరిగిన, యుద్ధానంతర ప్రతినిధిసంఘమును గురించి అదిఎట్లుపనిచేయవలెను. ఏవిధముగ నిర్ణయములుచేయవలెనుఅను సంగతులను గురించియు, అసలు రాజ్యాంగ ప్రణాళిక సూత్రముల స్వరూపమునుగురించియు; సవిస్తారముగా ఒడంబడికకుదిరిన, అంతత్వరగా యుద్ధానంతరము ప్రతినిర్ణయము కాగలదు.

బ్రిటిషుప్రభుత్వానికి సంబంధించినంతవరకు అచటి ప్రాథమికసూచ్యాచర్చ, ఈపరిశోధన జరుగుటకు సాధ్యమైనవిధముల సహాయము చే పెద మునివారన్నారు. దానితో పాటు, ... రాజ్యాంగముస్థిరపరచినతర్వాత కార్యక్రమమును ... తీవ్రగానిర్ణయములు జరిగిందటకు ... లో నున్నదేదైనను సాయపడుటకు కూడా వారంగీకరించారు ఇంతకంటెమెరుగైన వాగ్దానము చేయజాలరు. త్వరగాతృప్తికరముగా ఫలితము సాధించు బాధ్యత భారతీయులపైననున్నది

× × ×

## చర్చలపై ఆమెరీగారి ప్రత్యుత్తరము

చర్చలపై ప్రత్యుత్తరమిచ్చుచు ఆమెరీగారిట్లు చెప్పిరి.

వైస్రాయి కార్యవర్గమునందలి సభ్యులసంఖ్యవిషయమై పలువురుసభ్యులు ప్రశ్నించిరి. వైస్రాయిగారిచ్చిన సూచనలను భారతనాయకులు ఆదరించుటనుబట్టి కార్యవర్గసభ్యులసంఖ్యను నిర్ణయించవలసియుండును. ఏది యెట్లున్నను కార్యవర్గ సభ్యుల సంఖ్య ప్రస్తుత మున్నదానికన్న ఎంతోఅధికము చేయవలసియుండుననియే నమ్ముచున్నాను. నూతనముగ నియమింపబడు సభ్యులకుగూడ ప్రస్తుతముకార్యవర్గపుసభ్యులతో సమానమగు హోదాయుండును. కొన్నిశాఖలను పరిపాలించు బాధ్యత సంపూర్ణముగ వారికేవదలివేయబడును వారుతమ శాఖానిర్వహణమునకుసంబంధించిన బాధ్యతలను నిర్వర్తించుచు వైస్రాయి కార్యవర్గపు సమిష్టి నిర్ణయముల విషయమున గూడ తమపలుకుబడి నుపయోగించుచుందెదరు. వివిధపక్షములవారిచే పేర్కొనబడినవారే వైస్రాయి కార్యవర్గపుసభ్యులుగ నియమింపబడవలయునను విధిలేదు. కాని వివిధపక్షములనుండి మంచి పలుకుబడిగలవారినే వైస్రాయిగారు తన కార్యవర్గమున సభ్యులుగ చేర్చుకొనును. వీరిని సంపూర్ణముగ బాధ్యతగలిగిన మంత్రులుగ పరిగణింపలేదు. కాని అన్నిపక్షములనాయకులకు కార్యవర్గమున స్థానమున్న కేంద్రశాసనసభవిశ్వాసమును కార్యవర్గము పొందగలదనియే వైస్రాయి నమ్ముచున్నాడు. కాని ఒకవైపుర మహాసంగ్రామముజరుగుచున్న యీసమయమున వైస్రాయి కార్యవర్గమును ప్రభుత్వవర్గముగామార్చి పార్లమెంటుకు ఈమంత్రివర్గము బాధ్యతవహించియుండవలయునను సూచనను నేనెంతమాత్రము అంగీకరింపజాలను. ఇట్లుచేయుట ప్రస్తుతము భారతదేశమున వ్యాపించియున్న రాజకీయపరిస్థితులను సంపూర్ణముగ తిరస్కరించుట యగును, ఈవిషయమై వివిధపక్షములకు ఏర్పడిన భిన్నాభిప్రాయములను సమన్వయ మొనర్చుట సరియగు పద్ధతిగాని ఈవిషయముగ నిరంకుశమగు నిర్ణయము గావించుట సరికాదు. కావున ప్రస్తుతపరిస్థితులలో ఇట్టిమార్పు గావింపవీలులేదు, కేంద్రప్రభుత్వపక్షమున ఏర్పడుపరిణామమునుబట్టి రాష్ట్రీయ ప్రభుత్వవర్గములనిర్మాణము ఆధారపడియుండును

యుద్ధసలహా సంఘము

యుద్ధసలహాసంఘము ఇంకను పెద్దసంస్థగనుండును. ఇందులో ౨౦మందికిపైగా సభ్యులుండెదరు. భారతదేశమున అన్నివిషయములందు అనుభవముగలిగిన ప్రజాప్రతినిధులను ఒకచోట చేర్చి, యుద్ధకార్యనిర్వహణము విషయమున వారి సలహాలను ప్రభుత్వమునకు లభింపజేయుటయే ఈసంస్థ నిర్మాణమునకు ప్రధానోద్దేశమై యున్నది.

సర్ ఫ్రాంక్ ఒనీలుగారు,- కేవలము భారతీయులుమాత్రమే ఈసంఘములో సభ్యులుగ నుందెదరా!

ఆమెరీగారు- యుద్ధకార్య నిర్వహణమునకు భారతదేశమున పారిశ్రామిక వర్తకసంస్థలను చేరిన ఆంగ్లేయులసలహా, సహాయము అవసరము. కావున వీరికి ఈసంఘమున ప్రాతినిధ్యముండు విషయమై ప్రభుత్వమువారు ఆలోచించెదరు. భారతజాతీయ జీవితమునకుచేరిన ప్రముఖులు ప్రభుత్వమునకు సలహా ఇచ్చుచు యుద్ధకార్యనిర్వహణమున తమ పలుకుబడి నుపయోగించుటయే ముఖ్యమగువిషయము.

భావిరాజ్యాంగ నిర్మాణము

భావిరాజ్యాంగ నిర్మాణమును గురించి పలువురు ప్రశ్నలడిగియున్నారు. యుద్ధానంతరము భారతరాజ్యాంగనిర్మాణమును తయారుచేయు సంస్థవిషయమై పూర్తివివరములు ప్రభుత్వప్రకటనయందు తెలుపబడినవి. ఈసంస్థయొక్క స్వరూపమును నిర్ణయించుట నాపనికాదు, ఈసంస్థ స్వరూపమువిషయమై భారత రాజకీయములందలి ప్రధానపక్షములకు ఏకాభిప్రాయము కుదు

(౫వ పేజీచూడుడు)

# హాంకాంగ్ ఓడరేవు

## దాని ప్రాముఖ్యము

హాంగుకాంగు నూరేండ్లనుండి బ్రిటిషు క్రౌను గా నుండినది. ప్రపంచములో చాలముఖ్యమైన కొలనీ రేవుస్థలాలలో ఇదియొకటి. దీనికిగొప్ప ఏకార్పరుచున్నది దక్షిణచైనాతీరమునందునుంచి కీలకస్థానములో ఇదిఉన్నది అందుచేత దక్షిణచైనాకును మధ్యచైనాకును హాంగుకాంగే ముఖ్యప్రదేశము గా ఉన్నది.

౧౯౩౬లో చైనావారు కాంటన్, హాంకౌ రైల్వేను పూర్తిచేసి, హాంగుకాంగు, కాంటన్, హాంకౌ, పీపింగ, ట్రాన్సుసైబీరియా రైల్వేలను కలిపిరి. హాంగుకాంగుద్వారానే దక్షిణ మధ్యచైనాలకు అన్నిరకముల విదేశసామగ్రివచ్చెడిది. అందుచేతనిది యూరోపాకు ఎగుమతులకు ముఖద్వారముకూడ అయియున్నది. యూరోపు, అమెరికాలకు ఈరేవునుండి టీ, సిల్కు, చైనాయంత్రసామగ్రి నూనెపదార్థములు, యితరచైనావస్తువులు పోవును.

కౌలూన్ హాంగుకాంగు ప్రభుత్వముక్రింద నేఉన్నది. జనముచాలవరకు గ్రామీణులు. కౌలూన్ క్రొత్తనగరములో చాల అభివృద్ధిగల పరిశ్రమలున్నవి. పొడుగైనవీధులలో క్రొత్తరకమైన ఇండ్లున్నవి.

భూములు ఎగుడుదిగుడుగా, కోసుగా, పంటలు లేక ఉన్నవి. ప్రతి సస్యవంతమగు భాగములోనూ ధాన్యము, పంటకూరగాయలు మొదలైనవి పండింతురు.

కాంటనీస్, హాకాజాతులవారలు రైతులుకలిసి పనిచేతురు. హాకా గ్రామ ులవేరు. హాకాలు దక్షిణానికిమధ్య చైనానుండి మంగోల్ దాడులరోజులలో ౧౩, ౧౩ శతాబ్దాలలోవచ్చిరి, కాంటోనీస్ భాషవేరు వీరిభాషవేరు.

ఇపుడు వర్తకపరిశ్రమలు పుంజుకొనియున్నవి. హాంగుకాంగుద్వారానే దక్షిణ చైనాకు మార్గమున్నది ఈద్వీపము క్రొత్తప్రదేశములు గట్టిగా భద్రము గాఉన్నవి. ఇవిఇబ్రాల్టరు, ఏడెను లవంటివని చాలమంది తలచుచున్నారు.

అందుచేతనే యుద్ధములు జరుగుచున్న వివిధస్థలములనుండి శరణాగతులు ఇక్కడికి అసంఖ్యాకముగవచ్చిఉందురు, అందువల్లనే జపానీయులు తరచుగాదీని పరిసరములచుట్టూ జరిగెడిచర్యలలో శ్రద్ధగలిగియుందురు.

హాంగుకాంగుగవర్నరు సర్ జాఫ్రీఅల్ గ్రాండర్ స్టాఫీస్ట్ నార్థకోట్ గారు ప్రస్తుతము సెలవులోఉన్నారు ఈకాలనీపరిపాలనబాధ్యత ఈమధ్యనే ఒకగొప్పమిలిటరీ ఉద్యోగిచేతిలో పెట్టినారు. మేజర్ జనరల్ ఇ. ఎఫ్. నార్టన్ గారు భారతదేశములో ఇప్పుడు పశ్చిమజిల్లాలకమాండరు గాఉన్నారు. ఇప్పుడితడు లెఫ్టినెంటుజెనరలు. ఈమధ్య దూరప్రాచ్యఖండములో జరిగిన అంతరాతీయ పరిస్థితులవలన ఈ కమాండను నియామకము చాలప్రాముఖ్యముగలది. జనరల్ నార్టను గారి అనుభవము, సామర్థ్యము చాలవిలువగలిగిఉండును.

యూరోపుమీద జర్మనీ, ఇటలీలు చేయుచున్న దౌర్జన్యము హాంగుకాంగులో బ్రిటిషువారికనుకూలమైన భావములను, అభిమానమును హెచ్చుచేసినవి. అందువల్లనే బ్రిటనుకు చాలధనసహాయమువచ్చినది.

రు. ౬౫౦౦౦ డాలర్లను తక్కువకాని ధనసహాయమువచ్చినది బ్రిటనుకు విమానాల సరఫరాకొరకే ముఖ్యముగాఈసహాయము.

ఇక్కడ జూలైనుండి ఒకఆర్డినెన్సు చేసినారు. నిర్బంధసైనికశిక్షణ అమలులోవున్నది. ౧౮ ఏండ్లుదాటి ౫౫ఏండ్లకులోబడిన ప్రతిబ్రిటిషుపౌరునికిది వర్తించును. చైనాజపాను యుద్ధమువల్ల ౫౦౦౦౦౦ శరణాగతులు ఇక్కడికివచ్చినారు. ఈ కాలనీలసంఖ్య ఇప్పుడు ౨౦౦౦౦౦౦ఉన్నది.

---

## సిరియాలో ఫ్రాన్సు స్థితి

"డెయిలీ టెలిగ్రాఫ్"నుండి

పైపత్రిక ప్రత్యేకప్రతినిధి ఇట్లు వ్రాసినాడు "సిరియాలోఏంజ కుతూహలమున్నటువంటి ఉదంతాలను నేను అంకారాలో విన్నాను. ఫ్రెంచి అధికారులు పదులను సిరియాసపోనియ్యరు. వారు సెలవుపైడినా పరిస్థితులు మారనందున మరొకమారు నేను అచ్చటికిపోవచ్చునాఅని విచారించితే అది ప్రమాదముగానున్నదనిచెప్పిరి నాకుతెలిసినంతవరకు చెప్పేదేమంటే ఫ్రెంచివారిప్రతిష్ఠ కాస్తతగ్గినా వారిఅధికారం తగ్గలేదు. ముఖ్యంగా ప్రజానాయకుని ఖూనీఅయినా జనులలో సంచలనంకాలేదు. దీన్నిబట్టి మిత్రమండలివారి పోషకపాలనం (మాండెటరీ)బలియమగాఉన్నదని విశ్వాసము," సిరియాలో ముస్లిములు చాలమంది ఉన్నారు. కావున వారికెవరికి బ్రిటిషువారి విజయముపైననే ఆధారపడియున్నది. ఇంకొకరిని సిరియాలో దఖలియ్యనియ్యమని బ్రిటిషువారు అనుటచే సిరియాముస్లిములలోనుక్రిశ్చియనులలోను తృప్తికలిగించినది. ఇంగ్లీషువారు మధ్యధరాసముద్రంలోవుండే అంతవరకు ఎవరున్నా సిరియాలో కాలుపెట్టనుఅని ఒక ఫ్రెంచివాడు నాతో అన్నాడు సిరియాలో ఇటలీవారంటే వారికిమంట. ముఖ్యంగా ముస్లిములు ఇటలీవారు ఉత్తరఆఫ్రికాలోచేసిన దౌర్జన్యాలను మరచిపోరు. విమానాలనుండి ౧౨మంది ముల్లాలనుక్రిందికివేసి చంపిన ఇటాలియనులతోమాకు జోక్యమెన్నటికిని ఉండమనిఅన్నారు.

## రానున్న జనాభాలో హిందువులు

సింధు రాష్ట్రములోని సుక్కూరు నగరములో నిసాధుబేలాతీర్థ మహంతు గారగు శ్రీసద్గురు యోగిరాజు పూజ్యపాద శ్రీమహారాజ వనఖండీ మహంతు స్వామి శ్రీహరినామదాసజీ గారు స్వయముగా మాక్రింది విషయము ప్రకటనార్థము పంపియున్నారు:—

"సుక్కూరులోని శ్రీసాధుబేలా తీర్థము యొక్క మహంతునైన నేను హిందువుల క్షేమాభిలాషినై హిందూమతపీఠాధిపతులకును తదితరమహాజనులకును తెలుపుకొనుటయేమనగా రానున్న జనాభాలో ఏసంఘము అనుప్రశ్నకు అందరుహిందువులనిప్రాయించగలరు మతమేమను ప్రశ్నక్రింద వారు సనాతనులు సాధువులు, సిక్కులు, బౌద్ధులు, జైనులు, వాల్మీకులు, ఆర్యాలు, బ్రహ్మోలుమున్నగువని ప్రాయించుకోనవచ్చునుకాని మొత్తముపైన మనఐక్యతే రక్షించుకొనుటకై ఏతెగలేక సంఘముఅనుప్రశ్నకుఅందరు"హిందువులు" అనియే జవాబు ప్రాయించగలరు సిక్కుగురువులు హిందువులే. గురునానకు గారు ఖాయి కాలూరాంఅను హిందూక్షత్రియకుమారులు. జైనులు ఋషభదేవుని అనుయాయులు. అతని తండ్రి క్షత్రియ. బౌద్ధులను అట్టివారే ఆర్య, బ్రహ్మసమాజమువారును హిందువులే. నాలోకగలుచున్న యీహిందూమతప్రీతికొరకై నేను అందరికిని ఈవిధముగా వినతిచేసుకొనుచున్నాను."

